అక్టోబర్ 1983

144

# సృజన





నిర్వహణ

సాహితీ మిత్రులు

సంవత్సర చందా రు. 20          ఈ సంచిక రు. 3

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

144 మాసపత్రిక అక్టోబర్ 1983



ముఖచిత్రం : సుబ్బారావు పాణిగ్రాహి - సరోజ్ దత్తా


సృజన
హనుమకొండ - 506 001.

ఈ సంచిక రు. 3
సంవత్సర చందా రు. 20

SRJANA is commended for use in Public Libraries in th[e]
State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd[erabad]
Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Prited, Edited & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 00[1]
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor : Varavararao

# అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితికి విప్లవాభినందనలు

అక్టోబర్ 14, 15 తేదీల్లో ప్రథమ మహాసభలు జరుపుకుంటున్న అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితికి విప్లవాభినందనలు. భారత ఉపఖండంలోని వివిధ ప్రాంతాల్లో తరతమభేదాలతో విప్లవోద్యమం నాయకత్వంలో నిర్వహించబడుతున్న పోరాటాలకు సమన్వయంగానూ, బాసటగానూ సాంస్కృతికరంగం తనకర్తవ్యాన్ని నిర్వహించవలసిన భౌతికపరిస్థితులు ఈనాడున్నాయి. 1970 జులైలో విరసం ఏర్పడి అక్టోబర్‌లో ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో ప్రథమమహాసభలు జరుపుకునే నాటికి ఢిల్లీలో ఎజెండామీద ఆఫ్రో ఆసియన్ రచయితల సభలున్నాయి. దేశవ్యాప్తంగా యువతరంమీద, మేధావులమీద, సాహిత్యసాంస్కృతిక కార్యకర్తలమీద నక్సల్బరీ ఉద్యమప్రభావం పడకుండా చూడడానికి ఇందిరాగాంధీ 'కమ్యూనిస్టుల' నాశ్రయించింది. అందుకే డెబ్భై ఏప్రిల్‌లో లెనిన్ శతజయంతిని, మేలో మార్క్స్ జయంతిని దేశవ్యాప్తంగా ప్రభుత్వ ఆజమాయిషీలో నిర్వహించి ఆసియా ఆఫ్రికా రచయితల సభలను అరసం ఆధ్వర్యంలో ఢిల్లీలో తలపెట్టింది. ఈ సభలను బహిష్కరించి, ఈ సభలకువచ్చే కళాకారులకు, రచయితలకు, నక్సల్బరీ, విరసంవాణిని వినిపించాలని విరసం ఖమ్మంలోనే నిర్ణయించుకున్నది. ఆనాడే Voice of Prevolt అనే కవితాసంకలనాన్ని ప్రచురించి విరసం ప్రతినిధివర్గం ఆ సభల్లో తన భేరీమోగించింది. అయితే అప్పటికింకా అఖిలభారతస్థాయి విప్లవ రచయితలసంఘం ఏర్పడే పరిస్థితులులేవు. అందుకే ఆనాడు శ్రీశ్రీ హన్స్‌రాజ్‌రహబర్‌లు కన్వీనర్లుగా ఏర్పడిన అఖిలభారత విరసం ఆకాంక్షలో వ్యక్తమైనంతగా ఆచరణలోకాలేదు. కాని నక్సల్బరీ శ్రీకాకుళాలు హిందీ, బెంగాలీ, పంజాబీరచయితలకు గొప్ప ఉత్తేజాన్నిఇచ్చినవి. నక్సల్బరీ శ్రీకాకుళాలు దేశవ్యాప్తంగా విప్లవాభిమానులకు విప్లవ రచయితలసంఘాన్ని పరిచయంచేసినవి. ప్రాణప్రదంచేసినవి.

గుంటూరులో 1972లో జరిగిన విరసం తృతీయమహాసభలు మొదలుకొని 80 అక్టోబర్‌లో హైదరాబాదులో జరిగిన దశాబ్ది ఉత్సవాలవరకు ప్రతి మహాసభలోను

ఇతరభాషల్లోని విప్లవసాహిత్య సాంస్కృతికోద్యమాలతో సంబంధ అనుబంధాలను పెంచుకొనడానికి విరసం ప్రయత్నించింది. ఒరిస్సా, కేరళ, బెంగాల్, బెనారస్, ఢిల్లీ, మద్రాసులనుంచి ఒకటికి రెండుసార్లు విప్లవరచయితలువచ్చి విరసంసభల్లో పాల్గొన్నారు. పరస్పరం సాంస్కృతికరంగంలోని అనుభవాలను పంచుకున్నారు. విరసం రచయితలు జననాట్యమండలి కళాకారులూ దేశం నాలుగుచెరగుల చేసిన పర్యటనలు కూడ ఇందుకు దోహదంచేసాయి. విరసం ప్రారంభించిన ఈ ప్రయత్నాన్ని జనకీయ సాంస్కృతికవేది (పీపుల్స్ కల్చరల్ ఫోరమ్ - కేరళ) బెంగాలీవిప్లవీలేఖక్ శిల్పి బుద్ధిజీవీసంఘ్ పీపుల్స్ ఆర్ట్‌ఫోరమ్ (తమిళనాడు) ఆవాన్ నాట్యమంచ్ (బొంబాయి) మరింత బలపరచాయి.

ఈ ప్రయత్నాలేవీ నేలవిడిచిన సాముకావు. గాలిలోఅల్లుకున్న ఊహాబంధాలు కావు. కేరళలో వైనాడుఅడవుల్లో, త్రిచూర్ మైదానాల్లో, బెంగాల్‌లో సుందరబన్స్, నదియా, హుగ్లీజిల్లాల్లో, బీహార్‌లో గయ, జెహనాబాద్ భోజ్‌పూర్, పాట్నాలలో, తమిళనాడులో ఉత్తరఆర్కాట్, ధర్మపురిజిల్లా ఎలల వ్యవసాయక్షేత్రాల్లో, ఎల్గురి కొండల్లో, మధ్యప్రదేశ్, బస్తర్‌లో మహారాష్ట్ర చంద్రపూర్‌జిల్లాలో, బొంబాయి, సూరత్, అహ్మదాబాదు, ఢిల్లీ పరిసరపట్టణాల కార్మికవాడల్లో కరీంనగర్ రైతాంగ పోరాటం తనకు బాసటగానిలిచే పోరాటాలను పోల్చుకున్నది. అవన్నీ నక్సల్బరీ విస్తృతినీ వైవిధ్యాన్ని కరీంనగర్‌లో పనికట్టాయి. అన్నిప్రాంతాల పోరాటాలను ముడివేసే ప్రజాపంథా, వ్యవసాయ విప్లవం ఇరుసుగానడిపించే నూతన ప్రజాస్వామిక విప్లవం సహజంగానే సాంస్కృతికరంగంలో సారూప్యమైన అవసరాలను, కళారూపాలను కనుగొన్నది. ఇన్నాళ్ళకు ఈ అనుబంధానికి ఒక నిర్మాణరూపం వస్తున్నది. ఈ నిర్మాణం సాంస్కృతికరంగంలో కర్తవ్యాలను నిగ్గుదేల్చి విప్లవోద్యమానికి నిజమైన అండగానిలుస్తుందని ఆశిద్దాం.

8-10-83 — సంపాదకుడు

## పహరా హుషార్!

అజ్ఞాతసూరీడు

పరిస్థితి ఇప్పుడింకేమాత్రం
ప్రశాంతంగాలేదు-
కర్ణకుండల పిశాచి
కాషాయాంబరాలు ధరించి
కత్తులూ, కటార్లూ నూరుకొంటూ,
వెలుగును మింగెయ్యాలనీ
అలల్ని ఆపెయ్యాలనీ,
గోదావరికీ రైలు రోడ్డుకీమధ్య
పన్నెండుకోట్లు పారపోసింది:

అదిప్పుడు-
అగ్రగామికీ అశేషజనానికీ మధ్య
ట్రాన్స్‌మిషన్ బెల్టుల్లోని
కీలింకుల్ని తెగ్గొట్టాలనీ,
ప్రళయగాయకుల కంఠాల్ని నొక్కెయ్యాలనీ,
ఖడ్గసంగీతాన్ని రచించే
మునివేళ్ళని నరికెయ్యాలనీ ప్రయత్నిస్తుంది:

అన్నీ దాచెయ్యండి
అంతా దాచెయ్యండి
నిప్పుకనబడకుండా
నివుర్నికప్పండి,
అన్నలు కనపడకుండా
గుండెల్ని విప్పండి!

చేపలన్నీ ఇప్పుడు
ఎక్వేరియాలనుంచీ
ఎండవిమడుగుల్లోకి వెళ్లిపోవాలి :
ఊళ్లకీ బయళ్లకీ రక్షణగా
ఆయుధాలకు ఆ ఆ లనేర్పి
అడవిబిడుల్లోకి పంపండింక :

మార్పుకనుగుణంగా మారకపోతే
మనుగడసాగించడం కష్టం :
ఇంక మా సంగతంటారా-
ఏర్పాట్లన్నీ సజావుగానే వున్నాయ్ :
మాకాళ్లకింద కరకర సంగీతంపాడే
మోదుగాకులు మీకువిన్పించటంలేదూ :
వెన్నెల ఇక్కడ దారిచూపటాన్నితప్ప
మరెందుకూ పనికిరావటం లేదు :

దట్టమైన వృక్షాలకింద
చెమటపట్టిన యూనిఫారాలతో నడుస్తూంటే,
పొడుగ్గాపెరిగిన వెదురుపొదలు మాకభివాదం చేస్తున్నాయ్ :
కొండలుగుండెల్ని తెరుస్తున్నాయ్ :
ఒకమజిలీనుంచి మరోమజిలీకి
చేసే మహాప్రస్థానంలో
మీరూమాతోనేఅన్న విశ్వాసంతో పురోగమిస్తున్నాం :
నిజమైన వెనుగులాట
ప్రారంభంకాబోతోంది హారాహుషార్ :

27-9-83

# విగ్రహ మహాత్మ్యం

సరోజ్ దత్తా

గాంధీ ఈ దేశస్థుడైనా ఈదేశానికి చెందినవాడు కాలేకపోయినాడు. ఇతడి తండ్రి ఒకానొక సంస్థానాధీశుడి దగ్గర మంత్రిపదవి చేస్తుండేవాడు. గాంధీ ఇంగ్లాండులోచదివి బారిస్టర్ అయ్యాడు. ప్రాక్టీసుపెట్టడానికి దక్షిణాఫ్రికా వెళ్ళాడు. దగుల్బాజీతనంలో ఇతడు మొదటినుంచి దిట్ట. మొదటి ప్రపంచయుద్ధానికిముందు దక్షిణాఫ్రికాలోని జులూజాతి రైతుకూలీలు బ్రిటిష్‌ప్రభువులకు వ్యతిరేకంగా గొప్పగా పోరాడారు. ఆ పోరాటాన్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు రక్తపుటేరులలో ముంచేసారు. దక్షిణాఫ్రికాలో గాంధీ రాజకీయజీవితం జులూ[1] జాతి ప్రజల్ని అణచడంలో బ్రిటిష్‌వారికి సహకరించడంద్వారా ప్రారంభమైంది. తన యజమానులైన బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు గాంధీ మనోవాక్కాయ కర్మలా సహాయం చేసాడు. అప్పటినుండీ ఇతడు దక్షిణాఫ్రికాలోని దళారి బూర్జువావర్గానికి (వ్యాపారవర్గానికి) నాయకుడయ్యాడు. అహింసాత్మకోద్యమాన్ని ప్రారంభించాడు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు, తమకు ఉపయోగపడగలవ్యక్తిగా గాంధీని అప్పుడే గుర్తించారు.

గాంధీ భారతదేశపు రాజకీయాల్లో ప్రవేశించిన సందర్భాన్ని మనం ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు. 1914లో మొదటి ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. బ్రిటిష్ వారికి ఆ యుద్ధానికి అవసరమైన సైనికుల్ని సప్లయిచేసే కాంట్రాక్టరుగా ఇతడు భారతరాజకీయాల్లో అవతరించాడు. ఇతడు బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యుద్ధాన్ని కొనసాగించడానికి అవసరమైన ధనాన్ని, మానవుల్ని ప్రోగుచేయడానికి దక్షిణ ఆఫ్రికానుండి భారతదేశం వచ్చాడు. మొదటి ప్రపంచయుద్ధకాలంలో లెనిన్‌యుద్ధాన్ని వ్యతిరేకించాడు. యూరప్‌లోనూ రష్యాలోనూ ఉన్న కార్మికుల్ని సంఘటితపరచి విప్లవోన్ముఖుల్ని చేసాడు. సరిగ్గా అదేసమయంలో సామ్రాజ్యవాదుల ఫిరంగులకు అవసరమైన కళేబరాల్ని సప్లయిచేసే కాంట్రాక్టరుగా గాంధీ ప్రజలముందుకొచ్చాడు. ఈరకంగా భారతదేశపు నపుంసక దళారి బూర్జువావర్గానికి నమ్మినబంటైన నాయకుడైనాడు. మొదటి ప్రపంచయుద్ధం, రష్యాలోజరిగిన అక్టోబర్‌విప్లవం- ఈ రెండింటి ప్రభావము భారతదేశపు రైతుకూలీలమీద బాగాపడింది. రైతుల విప్లవపోరాటాలు ముమ్మరమయ్యాయి. ఆ విప్లవపొంగును దారిమళ్ళించడానికి తగినవ్యక్తి గాంధీయేనని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గుర్తించారు భారతపెట్టుబడిదారులూ గుర్తించారు. అంతక్రితమే బీహార్‌లోని చంపారన్[2] జిల్లాలో చెలరేగిన రైతుపోరాటాల్ని ఈ

గాంధీ అతినేర్పుగా ప్రతిష్ఠపట్టించాడు. సామ్రాజ్యవాదులైన తన యజమానులకు ప్రీతిపాత్రుడయ్యాడు, ఇతడిమాట, వేషం నడవడి మాయావియైన తపస్విలాగా ప్రజలమనసుల్ని ఆకట్టుకున్నాయి. ప్రత్యేకమయిననేర్పుతో అగ్రగాములైన, చైతన్య వంతులైన ప్రజలపై అంకుశాన్నివేసి అదిమిపట్టి సామ్రాజ్యవాదుల స్వార్థాన్ని సమకూర్చాడు,

కనుకే దుష్ట సామ్రాజ్యవాద శక్తులకు ఇతడు అనుంగులొత్తు అయ్యాడు. రష్యాలో అక్టోబర్ విప్లవం విజయంపొందింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి పట్టు కొమ్మలాంటి భారతదేశంలోనూ కమ్యూనిస్టు భావజాలం విరివిగా ప్రచారమవసాగింది. భారతదేశంకూడా ప్రపంచ సోషలిస్టు ఉద్యమంలో తనవంతుపాత్ర నిర్వహించ డానికి సమాయత్తమైంది. ఆలాంటి స్థితిలో దుష్టసామ్రాజ్యవాదానికి అండగా నిలబడి కమ్యూనిస్టు భావజాలంనుండి, విప్లవపోరాటాల్నుండి బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని కాపాడగలవాడూ, రక్షించగలవాడూ భారతదేశంలో ఒకే ఒక్కవ్యక్తి ఉన్నాడు, అతడే మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ. అప్పటికే గాంధీ హింసాత్మకమైన సాయుధ పోరాటానికి ప్రతిగా అహింసాత్మక పోరాటం అనే కృత్రిమపోరాటరూపాన్ని లేక సిద్ధాంతాన్ని బాగా ప్రచారంలోకి తెచ్చాడు- సాయుధపోరాటం ద్వారా సామ్రాజ్య వాదుల్ని తరిమికొట్టి అధికారాన్ని హస్తగతంచేసుకోవడానికిబదులు రాట్నం, సత్యా గ్రహం, ఉపవాసం, జైలు, శాంతియుత ఊరేగింపులు, పికెటింగులు మొదలు పెట్టాడు. ఈ విధంగా సామ్రాజ్యవాదులమీద ఒత్తిడి తీసుకువచ్చి కొన్ని రాయి తీల్ని పొందడానికి ప్రయత్నించాడు, అలాంటి ఆదర్శంతోనే కార్యక్రమాల్ని నిర్వ హించాడు. ఈరకంగా ప్రజాచైతన్యాన్ని, విప్లవోత్తేజాన్ని వెన్నుపోటుపొడిచాడు. జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ, చౌరాచౌరీ సంఘటన, పెషావర్ హిందూముస్లిమ్ సైనికులు జరిపిన సాయుధ తిరుగుబాటు, దక్షిణభారతంలోని మాప్లారైతులతిరుగు బాటు ఇంకా ఇలాంటివే అనేక విప్లవపోరాటాలు జరిగాయి. పై చెప్పిన అన్ని సందర్భాలలో గాంధీ ఎంతోనేర్పుగా నాటకమాడి ప్రతీఘాతుక ఉద్యమాల్నినడిపాడు.

రష్యావిప్లవం తరువాత కంగుతిన్న బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి గాంధీ ఓరక్ష కుడిలా దొరికాడు. విప్లవవాతావరణంలో ప్రపంచరాజకీయ పరిస్థితులే మారిపోయాయి. భారతదేశ పరిస్థితులూమారాయి. ఈ స్థితిలో దళారిబూర్జువావర్గం తమ లిబరల్ రాజ కీయపు పెత్తుగడలు చెల్లుబాటుకావని తెలుసుకుంది. ఆ వర్గానికి ఇప్పుడు కొత్తరాజ

కీయ ఆవరణకావాలి, ఆ కొత్తఆవరణ గాంధీవాదం- భారతదళారి బూర్జువావర్గాన్ని రక్షించి తద్వారా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి మరికొంత ఊపిరిపోసిన నాయకుడు కొల్లాయి కట్టిన గాంధీ.

భారత దళారిబూర్జువావర్గం, కొల్లాయికట్టిన ఈ గాంధీ అధినాయకత్వంలో, సాయుధరైతుపోరాటాలకు ప్రతిగా మోసపూరితమైన జా తీ యో ద్య మా న్ని ప్రారంభించింది.

ఈ గాంధీ, ఈ జాతీయోద్యమం భారతదేశంలో బ్రిటిష్‌వాళ్ళకు నూకలు మిగులుస్తాయని భారత బూర్జువావర్గానికి బాగాతెలుసు. కాకపోతే 1919లో జలియన్ వాలాబాగ్ హత్యాకాండ జరిగాక దేశమంత ఓ అగ్నిపర్వతంలా పేలిలడానికి సిద్ధమైంది. దీనికి చేదోడుగా లెనిన్ నాయకత్వంలో మూడవ ఇంటర్నేషనల్‌లో వలస దేశాల్లోని విముక్తి పోరాటాలకు చేయూతనివ్వాలన్న నిర్ణయం జరిగింది. అలాంటి విప్లవ పోరాటదశలో అవమానకరమైన, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల ఎంగిలిమెతుకుల్లాంటివి చెమ్స్‌ఫర్డ్ సంస్కరణల్ని అంగీకరించండని భారత ప్రజలకు చెప్పే ధైర్యం కొల్లాయికట్టిన ఈ గాంధీకి తప్ప మరిఎవరికుంటుంది? దళారి బూర్జువావర్గపు లిబరల్ నాయకులైన వెనకటి దొరలకు అంతటిధైర్యమెక్కడిది?

దేశమంతటా కార్మికులసమ్మెలు, మాప్లాఉద్యమాల్లాంటి రైతుపోరాటాలు ముమ్మరం అయ్యాయి. వాటిలో గాంధీకి ఎక్కడో సుదూరానగల రష్యాలో జరిగిన బోల్షివిక్ విప్లవఛాయలు కనపడుతున్నాయి. ఇటు మూడవ ఇంటర్నేషనల్ ద్వారా చైనా మొదలైన ఆసియాదేశాలలో కమ్యూనిస్టుపార్టీలేర్పడ్డాయి. విప్లవాన్ని ఆవాహనం చేస్తున్నాయి ఆ స్థితిలో హిందూముస్లిం ఐక్యత అనే మోసపూరిత నినాదంతో ఖిలాఫత్ ఉద్యమంతో కూడబలుక్కున్న కుతంత్రంతో సహాయనిరాకరణోద్యమాన్ని ప్రారంభించాడు గాంధీ. ఈ రకంగా అతిఉగ్రమైన విప్లవ అవకాశాన్ని ధ్వంసం చేసి దళారి బూర్జువావర్గపు దొంగ జాతీయోద్యమాన్ని ప్రారంభించాడు. శ్రామికవర్గ అధినాయకత్వంలో విప్లవోద్యమాన్ని కొనసాగించవలసి ఉండగా సామ్రాజ్యవాదులకు పరోక్షంగా ప్రాణంపోయగల సహాయనిరాకరణమనే కృత్రిమ ఉ ద్య మా న్ని ప్రారంభించాడు. ఈ కృత్రిమ ఉద్యమంలోనూ చౌరాచౌరీ సంఘటనలో గాంధీకి రష్యన్ విప్లవపు ఛాయలు కన్పించాయి. హింసకన్పించింది. అవకాశవాది అయిన గాంధీ హింససాకుతో సహాయనిరాకరణోద్యమాన్ని ఆపేసాడు. నిరుత్సాహంలో

మునిగిన దేశాన్ని సామ్రాజ్యవాద కోరలకు బలిచేసి దూరంగా తప్పుకున్నాడు గాంధీ. దీంతో సామ్రాజ్యవాదులు గాంధీ తమకు ఎంతటి ఉపయోగకారికాగలడో తెలుసు కున్నారు. అంతేకాదు కార్మికకర్షక విప్లవోద్యమంపట్ల ఇంతటిద్రోహం చేయగల వ్యక్తి భారతదేశంలోనేకాదు సమస్తవలసదేశాల్లోనూ మరెక్కడాదొరకడని సామ్రాజ్య వాదులు తెలుసుకున్నారు.

1930 లో ప్రపంచ వ్యాప్తంగా ఆర్థికమాంద్యం వచ్చింది. దేశంలో మరో మారు విప్లవ జ్వాలలు ఎగిసాయి. అమృత్‌సర్, సోలాపూర్, పెషావర్ మొదలైన పట్టణాల్లో సైనికులు, శ్రామికులు ఓనూతన విప్లవచరిత్రను సృష్టించారు. విభిన్న ప్రాంతాలలో సాయుధరైతు పోరాటాలు ప్రజ్వరిల్లాయి. సరీగా అదేసమయంలో ఆ విప్లవపోరాటాలనుండి ప్రజలదృష్టిని మళ్ళించడానికి గాంధీ శాసనోల్లంఘనాన్ని ప్రారం భించాడు. మధ్యలోనే ఆ ఉద్యమాన్ని ఆపివేసి రౌండ్‌టేబుల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళి పోయాడు. తిరిగివచ్చాక హరిజనుల్ని దేవాలయప్రవేశం చేయించే ఉద్యమాన్ని చేపట్టాడు. ఈ రకంగా సామ్రాజ్యవాదులకు అభయాన్నిచ్చాడు. మరోమారు సామ్రాజ్యవాదులు గాంధీలాంటి రక్షకుడు భారతదేశంలో తమకు మరొకడులేడని తెలుసుకున్నారు. 1903వ దశకంలో జరిగిన ఒక సంఘటనగురించి చెప్పడం అవసర మనుకుంటున్నాను. కాంగ్రెస్ పెద్దలు మంత్రిపదవుల్ని స్వీకరించారు. బొంబాయి లోని కార్మికులమీద కాల్పులుజరిపారు. అహింసే తన జీవితధ్యేయమని చెప్పు కుంటున్న గాంధీ ఆ కాల్పుల్ని సమర్థించాడు. దీన్నిబట్టి గాంధీచెప్పే అహింస ఎవరి కోసమో తేటతెల్లమవుతున్నది.

1939లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. ఇంగ్లీష్ ప్రభువులు ఇరకాటంలోపడ్డారు. స్వామిభక్తుడైన గాంధీ తనసేవల్ని అందించడానికి ముందుకు వచ్చాడు. "ఇరకాటంలోవున్న బ్రిటీష్ సామ్రాజ్యవాదుల్ని తాను మరికొంచెం ఇబ్బందిపెట్టననీ, వారికి సహాయంచేస్తాననీ" గాంధీఅన్నాడు. సిగ్గుపడిని "లండన్ రాజమహల్ మీద బాంబులు పడడంఅన్న వూహనే తాను సహించలేన"నీ వాపోయాడు. కానీ హిట్లర్ రష్యామీద దాడిచేయటంతో యుద్ధంయొక్క రూపంమారింది. భారత దేశపు దళారీబూర్జువావర్గం ఫాసిస్టు శక్తులముందు (జర్మనీ, జపాన్, ఇటలీ) బ్రిటిష్ సామ్రాజ్యవాదం ఓడిపోతుందని గట్టిగానమ్మింది. వెంటనే గాంధీ ప్లేటుఫిరా యించాడు. రాత్రికిరాత్రి బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఘోరశత్రువయ్యాడు. 'గెలిచినవాడే మనవాడు' అన్న సామెతగా ఫాసిస్టుశక్తుల్ని సమర్థిస్తూ 1942 క్విట్

ఇండియా ఉద్యమాన్ని ప్రారంభించాడు. ఈరకంగా స్టాలిన్ అధినాయకత్వంలో జరుగుతున్న విశ్వవ్యాపితమైన ఫాసిస్టు వ్యతిరేకపోరాటానికి వెన్నుపోటు పొడిచి తాను జైలుపాలయ్యాడు. తరవాత చరిత్ర స్పష్టమే. యుద్ధాన్ని గురించి అతడిఅంచనాలు తారుమారయ్యాయి. దాంతో గాంధీ మళ్ళీ బ్రిటీష్ సామ్రాజ్యవాదులకు నమ్మిన బంటు అయ్యాడు. యుద్ధకాలంలోనూ, ఆ తరవాత దేశంమొత్తంలోనూ చెలరేగిన విప్లవజ్వాలల్ని నేర్పుగా పక్కదారిపట్టించాడు. దేశంలోని పోరాటచైతన్యం వెర్రి తలలువేసి మతయుద్ధాలుగా బ్రద్దలవడానికి గాంధీ సమిధల్ని సమకూర్చాడు. ఈ రకంగా బ్రిటీష్ సామ్రాజ్యవాదులద్వారా దేశాన్ని రెండుముక్కలు చేయడానికి మార్గాన్ని ప్రశస్తంచేసాడు. బ్రిటీష్‌వారి స్వార్థాన్ని ఈదేశంలో శాశ్వతంగా కాపాడటానికి అవసరమైన ప్రాతిపదికల్ని తయారుచేసాడు. కాగా, హిందూ, ముస్లిం శ్రామికజన సముదాయాల సాయుధపోరాటాన్ని ఏగాంధీ అయితే పక్కదారిపట్టించి బ్రిటీష్ సామ్రాజ్యవాదుల స్వార్థాన్ని కాపాడటానికి మతయుద్ధాలకు కారకుడయ్యాడో ఆగాంధీ తాను రగిల్చిన మతయుద్ధజ్వాలల్లోనే మాడి మసి అయిపోయాడు. ఇతడి చావుతో సామ్రాజ్యవాదులు తమరక్షకుల్లో ఒకడ్ని కోల్పోయారు. తాము ఎన్నటికీ పూడ్చుకోలేని లోటునుపొందారు సామ్రాజ్యవాదులు.

అయితే అన్నిటికంటే విచిత్రమయిన విషయం ఏమిటంటే గాంధీయొక్క ఈ కుతంత్రాన్ని భారతదేశంలోని కమ్యూనిస్టులుకూడా అర్థంచేసుకోలేకపోయారు. నిజంగా అర్థంచేసుకోలేక పోయారందామా ? కమ్యూనిస్టులు కావాలనే గాంధీయొక్క ఈ కుతంత్రాన్ని కప్పిపుచ్చారు. ఎందుకంటే ఈ దేశంలోని కమ్యూనిస్టులు మొదటి నుంచీ, సామ్రాజ్యవాదుల దళారీలే. ఇలా ఎందుకంటున్నానంటే ఈ దేశంలోని కమ్యూనిస్టులు శ్రామికజన విప్లవకర్తవ్యాన్ని సరియైనమార్గంలో నిర్వహించిఉన్నట్లయితే, గాంధీ ఈ దేశంలో ఇంతబలపడేవాడుకాడు. ఈ దేశపు దళారీ బూర్జువా వర్గం భూస్వామ్యవర్గం నడుపుతున్న లేక ఆ వర్గాలకు ప్రతినిధి అయిన గాంధీ నడుపుతున్న ఉద్యమాల్ని నిజమయిన జాతీయఉద్యమాలుగా కమ్యూనిస్టులూ అంగీకరించారు. కార్మిక కర్షకశక్తిని వారి పోరాటఉద్యమాల్ని గాంధీ ఉద్యమాలకు తోకల్ని చేసారు. గాంధీని జాతిపితగా అంగీకరించడానికి వారు ఏ మాత్రమూ సంకోచించలేదు. డాంగే సుందరయ్యలిద్దరూ కాంగ్రెస్‌కు దేశంలో నామరూపాలులేకుండా చేయడానికి కటిబద్ధులయ్యారన్న ప్రచారం ఒకటుంది. కాంగ్రెస్ నాయకుడు గాంధీయే వీళ్ళిద్దరికీ తండ్రిఅయినప్పుడు ఇంకదేశంలో కాంగ్రెస్‌కు నామరూపాలులేకుండా

వీళ్ళు ఎలాచేస్తారు? ఈ ప్రశ్నకు సమాధానం ఈనాడు దేశంలోని విప్లవకారులైన యువకులు విద్యార్థులు చెపుతున్నారు.

కొందరు గాంధీని లెనిన్‌కూడా పొగిడారని చెపుతున్నారు. అలాచెప్పేవాళ్ళు లెనిన్ రచనల్లోంచి ఏఒక్క ఉదాహరణనూ చూపడంలేదు. అయితే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్‌చేత బైటకునెట్టబడీ చైనాలో విప్లవానికి ద్రోహంచేసిన యం. యన్. రాయ్‌ని ఉదహరిస్తున్నారు. ఇతడు సామ్రాజ్యవాదుల ఏజంటుగా ప్రసిద్ధిపొందాడు. ఇంటర్నేషనల్‌ద్వారా బైటకునెట్టబడిన యం. యన్. రాయ్ ముఖతా లెనిన్‌మాటల్ని వినగోరే ఉత్సాహవంతులైన మార్క్సిస్టులను ఒక్కటడుగుతున్నాను. గాంధీనిగురించి స్టాలిన్ ఇచ్చిన అభిప్రాయాన్ని మీరు ఎందుకు కావాలని దాచేస్తున్నారు? మార్క్సిస్టు మహామేధావులు అశోక్‌రుద్రా మొదలయినవారు మార్క్స్, ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్, మావో రచనలన్నింటినీ బాపోసన పట్టేఉంటారు. మరి 1930లో స్టాలిన్ చెప్పిన క్రిందివాక్యాల్ని వీరుచదవలేదా?

గాంధీ గురించిన స్టాలిన్ అభిప్రాయాన్ని క్రింద ఉదహరిస్తున్నాను.

“భారతదేశం, ఇండోచైనా, ఇండోనేషియా, ఆఫ్రికా ఖండంలోని ఇతర దేశాల్లోను విప్లవోద్యమం ఉరకలువేస్తూ వ్యాప్తిచెందుతున్నదనడానికి సందేహంలేదు. పైదేశాల్లో విప్లవోద్యమం అప్పుడప్పుడూ జాతీయ పోరాటరూపాన్ని ధరించింది. పైదేశాలన్నింటిలోనూ కసాయి బూర్జువా పరిపాలకులు ఆయాదేశాల విప్లవపోరాటాల్ని రక్తపుటేరుల్లోముంచారు. క్రూరహింసావిధానం ద్వారా అక్కడి ఉద్యమాల్ని అణచడానికి ప్రయత్నించారు. వాళ్ళ ప్రయత్నాలు రెండురకాలుగా జరిగాయి. ఒకటి తుపాకీ ద్వారా విప్లవోద్యమాన్ని అణచడమూ రెండవది గాంధీలాంటి వ్యక్తులద్వారా విప్లవోద్యమాన్ని తప్పుదారిపట్టించడము. తుపాకి సాయంతో విప్లవోద్యమాల్ని అణచడం అనేది పూర్తిఫలితాన్నిచ్చే ప్రక్రియకాదు. జార్ ప్రభుత్వం కూడా తుపాకులతోనే విప్లవోద్యమాన్ని అణచడానికి ప్రయత్నించింది. ఈ ప్రయత్నం ఫలించలేదనివేరే చెప్పనవసరం లేదనుకుంటాను. భారతదేశంలో గాంధీ ఎలా బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి సహకరించాడో అలానే రష్యాలో జార్‌ప్రభువులకు సహకరించిన నాయకులూఉన్నారు. వాళ్ళందరూ అనేకరకాల సంస్కరణవాదాలతో ముందుకువచ్చారు. కాని వాళ్ళవల్ల జార్ ప్రభుత్వాన్ని కాపాడటం జరుగలేదు. సరికదా దానిసర్వనాశనమే జరిగింది.”

స్టాలిన్ ఇలా స్పష్టంగా గాంధీని తెగనాడాడు. మరి 'గాంధీ విప్లవకారుడు' అని లెనిన్ ఎమ్.ఎన్. రాయ్ చెవిలో చెప్పాడేమో? లెనిన్ చనిపోయిన ఆరుసంవత్సరాల తర్వాత స్టాలిన్ గాంధీని సామ్రాజ్యవాదులకు దళారీ అంటున్నాడు స్టాలిన్, లెనిన్ మార్గంనుంచి తప్పిపోయాడని దస్తాలదస్తాలు ఖరాబుచేసే పైచెప్పిన మార్క్సిస్టు మహామేధావులు గాంధీ విషయంలోనూ స్టాలిన్, లెనిన్ మార్గంనుండి దారి తప్పాడన వచ్చుకదా? మరి స్టాలిన్ ఇంత పెద్ద తప్పిదం చేసినప్పుడు దీన్ని ఎవ్వరూ ఎందుకు ఉదహరించరో?

మధ్యయుగాల రాచరిక కుసంస్కారాన్నీ, దుష్టసంస్కృతినీ ఈ దేశంలో లక్షణంగా కాపాడి గాంధీ బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి ఈ దేశంలో నూకలుమిగిల్చాడు. మతం పేరుమీద, సంస్కరణ పేరుమీద ఆతడు ప్రతిసారీ ప్రజాఉద్యమాల్ని ప్రక్కదారిపట్టించాడు. వీటన్నిటికీ వివరాల్ని యిక్కడ ఉదహరించబోవడంలేదు. ఈ దొంగ సాధువు, ఈ కొల్లాయికట్టిన కృత్రిమ త్యాగియొక్క నైతిక ప్రవర్తన గురించి గాంధీ భక్తుడైన ప్రొఫెసర్ నిర్మల్ బోస్ తన జీవితకథలో అత్యంత జుగుప్సాకరమైన నిజాలని బయటపెట్టాడు. బ్రహ్మచర్యం పేరుమీద యితడి విటజీవితాన్ని గురించి అనేక సత్యాలను ఉదహరిస్తూ వాటికి ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం వెర్రిమొర్రి వ్యాఖ్యలు వ్రాసాడు. వాటిగురించీ నేనిక్కడ ఉదహరించడంలేదు. నేను ఉదహరించకపోయినా విప్లవకారులైన యువకులూ, విద్యార్థులూ ఊరక చేతులుముడుచుకూర్చోరు. వాళ్ళు ప్రతివాక్యాన్ని ఆద్యంతాలు పరిశోధిస్తారు. ఇన్నాళ్ళు అనేక రహస్యాల్ని భద్రపరచిన గుహాయుగాలనున్న బండరాళ్ళను తొలగిస్తున్నారు. విప్లవకారులూ, యువకులూ, విద్యార్థులు సాగిస్తున్న ఈ దాడిలో అనేకమైన సత్యాలు బయటపడుతున్నాయి. బహుకాలంగా ప్రజల హృదయాల్లో గూడుకట్టుకున్న అసత్య ప్రచారాలు, మోహజాలాలు విచ్ఛిన్నమవుతున్నాయి. ఈ స్థితినిచూచి 'జాతిపిత' యొక్క అక్రమసంతానం ఉలిక్కిపడుతోంది.

ఈనాడు అన్నిరకాల భ్రమలను తొలగించి ప్రజల మేధస్సుకు సరైన వెలుగునిచ్చే బాధ్యత విప్లవకారులది. అందుకే వారు గతకాలానికి చెందిన అనేకమైన భ్రమలనూ, మోహజాలాలను గండ్రగొడ్డళ్ళతో ఛేదించేస్తున్నారు. వీటిగురించి పరిశోధించే పరిపూర్ణమైన బాధ్యతను మేధావులు స్వీకరించవలసి ఉంటుంది. విప్లవాత్మక యువశక్తి చారిత్రికనేపథ్యంనుండి సాంస్కృతిక పోరాటాన్ని సాగిస్తున్నారు.

ఈ పోరాటాన్ని మేధావులు ముందుకు తీసుకువెళ్ళవలసి ఉంటుంది. సాంస్కృతిక రంగంలోని దుబ్బుల్నీ. ముళ్ళకంచెల్నీ నిర్దాక్షిణ్యంగా నరికివేస్తున్న విప్లవ యువ శక్తికి నా లాల్ సలామ్.

[ఆలూరి భుజంగరావు గారు అనువదించి ప్రచురించిన "అమరుడు కామ్రేడ్ సరోజ్ దత్తా రచనలు – గాంధీగురించి సుభాష్ బోసుగురించి" నుంచి]

---

1. జులూ రైతు పోరాటం : దక్షిణఆఫ్రికాలో జాత్యహంకార తెల్లప్రభుత్వానికి వ్యతిరేకంగా, స్థానీయ ఆదివాసులయిన జులూ ప్రజలు నిరంతరమూ పోరాటాన్ని సాగించారు. ఆ పోరాటకాలంలోని కొన్ని సందర్భాలలో గాంధీ అక్కడే వున్నాడు. దక్షిణ ఆఫ్రికాలోఉన్న భారతీయుల్ని జులూ ప్రజల పోరాటాలకు దూరంగా వుంచటం కోసరమే గాంధీ మొట్టమొదటగా సత్యాగ్రహ ఉద్యమాన్ని అక్కడ ప్రారంభించాడు. ఈ సత్యాగ్రహ ప్రారంభ సమయంలోనే న్యూకాసిల్ బొగ్గుగనుల్లోని దాదాపు ఆరువేల మంది కూలీలు సమ్మెచేశారు. ఆ సమ్మెను దారిమళ్ళించటం కోసరమూ గాంధీ సత్యాగ్రహమనే సంస్కరణవాద పోరాటాన్ని ప్రారంభించాడు. ఇంతకంటె కూడా దారుణమయిన విషయం గాంధీనేరుగా బ్రిటీషు సైన్యానికి, జులూ, బోయర్-ప్రజల పోరాటాలకు విరుద్ధంగా, సహకరించాడు. 18 మార్చి 1922 న అహమ్మదాబాద్ కోర్టులో గాంధీ ఇలా చెప్పాడు. "1906 లో జులూ ప్రజలు విద్రోహానికి తలపడినప్పుడు నేను క్షతగాత్రుల్ని స్ట్రెచర్లమీద తీసుకువెళ్ళడానికి ఒక దళాన్ని ఏర్పాటు చేశాను. ఆ విప్లవం చల్లారేవరకూ నేను అలా సహకరించాను. పైవిధమయిన నా సహకారానికి ప్రతిఫలంగా నాకు పతకాల్ని, బిరుదుల్ని ప్రదానం చేశారు బ్రిటిషు వారు! దక్షిణాఫ్రికాలో బ్రిటిషువారికి నేను చేసినసేవలకు సంతసించి లార్డ్ హార్డింగ్ నాకు హింద్ కేసరి అన్న బిరుదునిచ్చాడు".

'భారతదేశంలోని ఇంగ్లీషువారందరికీ' అన్న తన బహిరంగలేఖలో గాంధీ ఇలా వ్రాశాడు, "నేను బ్రిటిషు సామ్రాజ్యంకోసం నాలుగుమార్లు ప్రాణాపాయ స్థితిలోపడ్డాను......... మూడవసారి గతయుద్ధపు (ప్రథమ ప్రపంచ సంగ్రామం) ప్రారంభంలో నేను ఒక అంబులెన్సు దళాన్ని తయారుచేశాను. అదే సందర్భంలో కఠినమైన అభ్యాసం కారణంగా భయంకరమైన ప్లూరసీకి గురిఅయ్యాను. నాల్గవమారు ఢిల్లీలో జరిగిన యుద్ధసమ్మేళనం సందర్భంగా లార్డ్ చేమ్స్ఫర్డ్ కు కొన్ని వాగ్దానాలు చేశాను. ఆ వాగ్దానాలను పూర్తి చేయటానికి ఖేడాజిల్లాలో యువకుల్ని యుద్ధసైనికులుగా

చేర్చడం కోసరం చాలా పరిశ్రమించాను. మారుమూల గ్రామాలకుకూడా తిరిగాను. ఆ పరిశ్రమ కారణంగా భయంకరమైన భేదులు ప్రారంభమయినాయి. దాదాపుగా చచ్చిబతికాను."

చౌరా - చౌరీ : 1920 వ సంవత్సరపు చివరలో జరిగిన విషయం. రష్యన్ విప్లవ ప్రభావం భారతదేశంలోని పోరాటాలమీద అనివార్యంగా పడ్డది. గాంధీ సహాయనిరాకరణోద్యమం ప్రారంభించినప్పటికీ భారతదేశంలోని విప్లవ పోరాటాలు అణిగిపోలేదు. 5 ఫిబ్రవరి 1922 లో గోరఖ్‌పూర్‌కి 15 మైళ్ళదూరంలోని చౌరా-చౌరీలో బ్రిటిషు పోలీసులు ఇద్దరు రైతుల్ని చంపివేశారు. దీనికి ప్రతీకార చర్యగా స్థానిక రైతులు తిరుగుబాటుచేసి 22 మంది పోలీసుల్ని, ఇంగ్లీషువారిని సజీవ దహనంచేశారు. అదే నెల 12 వ తారీకున, గాంధీ ఆజ్ఞానుసారం కాంగ్రెస్ కార్య కారిణీ సమితి స్థానీయ రైతులపైచర్యను ఖండిస్తూ చనిపోయిన ఇంగ్లీషువారిపట్ల సానుభూతి తెల్పుతూ సహాయనిరాకరణోద్యమాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించింది. గాంధీయొక్క ఈ చర్యను విమర్శిస్తూ లూయీఫిషర్ ఇలా అన్నాడు. "గాంధీ కనుక పిలుపు ఇచ్చినట్లయితే మొత్తం భారతదేశం విప్లవపోరాటానికి సన్నద్ధమయ్యేది. కానీ, గాంధీ విప్లవానికి పిలుపు ఇవ్వకపోగా అహింస అనే బలిపీఠంమీద ప్రజల విప్లవ చైతన్యాన్ని, ఉత్సాహాన్ని బలిపెట్టాడు".

పెషావర్ :

హిందూ ముస్లిమ్ ఐక్యసైనిక తిరుగుబాటు

దేశం అంతట్లోనూ హింసాత్మక విప్లవాలు చెలరేగడంచూసి 5 ఏప్రియల్ 1930 న గాంధీ ఉప్పుసత్యాగ్రహాన్ని ప్రారంభించాడు. దేశంఅంతటా సైనిక సాయుధవిద్రోహాలు జరిగాయి. ఏప్రియల్ 23న పెషావర్‌లోనూ కొన్ని విప్లవచర్యలు జరిగాయి. ప్రజలు డిప్యూటీకమీషనర్‌ను గాయపరిచారు. ఒక సాయుధ శకటాన్నీ, ఒక మోటారుసైకిల్‌నీ ధ్వంసంచేశారు. ముస్లిమ్‌జనసంఖ్య అధికంగాగల ఈ ప్రాంతంలో 18 వ రాయల్ గఢ్‌వాలీ రైఫిల్సుయొక్క రెండవ బెటాలియన్‌లోని రెండు హిందూ విభాగాలు ప్రభుత్వంమీద తిరుగబడ్డాయి. ప్రజలను కాల్చటాన్ని నిరాకరించాయి. ఏప్రియల్ 23 నుంచి పెషావర్ పట్నమంతా తిరుగుబాటుదారుల ఆధీనంలో వుండిపోయింది. తిరుగుబాటుదారులూ, ప్రజలూ. పెషావర్ పట్నాన్ని సంపూర్ణంగా ఆధీనంలోకి తీసుకున్నారు. ఇంగ్లీషువాళ్ళు తిరుగుబాటుచేసిన సైనికుల్ని

జయించి తిరిగి పెషావర్‌పట్నాన్ని తమ అధీనంలోకి తెచ్చుకున్నారు. గాంధీ తిరుగుబాటుదారులైన సైనికుల్ని తీవ్రంగా నిందించాడు. అలాగే బొంబాయిలోని నావికా సైనికులు, (వీరిలో హిందువులూవున్నారు ముస్లిములూ పున్నారు) చాలా ఐక్యతతో ప్రభుత్వానికి ఎదురుతిరిగారు. అప్పుడు గాంధీ ఇలా అన్నాడు. "హింసాత్మక కార్యక్రమాల కొరకు హిందూముస్లిమ్‌గానీ, మరిఎవరేకానీ ఐక్యమవడం అపవిత్రమైన ఐక్యత."

దక్షిణభారత మాప్లారైతు పోరాటం [1920-22] : మలబార్ జిల్లాలోని వాల్వానద్, ఎరెండ్, తాలూకాల్లో అరబ్బుజాతికి చెందిన మాప్లాలనే ముస్లిమ్ రైతులు ఉంటున్నారు. వీరు మాటీమాటికీ బ్రిటీషు ప్రభుత్వంమీద తిరుగబడుతున్నారు. ఈ తిరుగుబాట్లను అణచడంకోసం బ్రిటీషు ప్రభుత్వం 'మాప్లా ట్రిజన్‌యాక్ట్'ను ప్రకటించింది. అయినప్పటికీ, 1920 లో దేశం అంతట్లోనూ చెలరేగిన విప్లవ సాయుధ తిరుగుబాట్ల సందర్భంగా మాప్లాలు మరోమాటు తిరుగుబాటు బావుటాను ఎగురవేశారు. ఖిలాఫత్ ఉద్యమాన్ని, సహాయనిరాకరణోద్యమాన్ని లెక్కపెట్టకుండా, 1921 లో మాప్లారైతులు గెరిల్లా పోరాటపద్ధతిని అనుసరించారు. గాంధీ నాయకత్వంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మాప్లాపోరాటాన్ని నిందిస్తూ ఇలా ప్రకటించింది. "మలబారులోని కొన్ని తాలూకాల్లో మాప్లాలు సాగించిన హింసాత్మక కార్యక్రమాలపట్ల కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ విచారాన్ని వ్యక్తపరుస్తోంది."

ఛేమ్స్‌ఫోర్డు సంస్కరణలు : భారతదేశపు మంత్రిఅయిన మాంటేగ్యూ, వైస్రాయి ఛేమ్స్‌ఫోర్డ్ - వీరిద్దరూ 1917 నాటి సోవియట్ విప్లవ ప్రభావంతో భారతదేశంలో చెలరేగిన సాయుధపోరాటాలను దృష్టిలోపెట్టుకుని నామమాత్రపు స్వాయత్త శాసనాన్ని ఇస్తామంటూ 22 ఏప్రియల్ 1918న ఒక రిపోర్టును ప్రకటించారు. (భారత చరిత్ర, రమేష్‌చంద్ర మజూందార్‌రాసింది, రెండవభాగాన్ని చూడండి.) దీని తరువాత రౌలెట్‌చట్టం సందర్భంగా ప్రజాఉద్యమాలు ముమ్మరమయ్యాయి. జలియన్ వాలాబాగ్ తరువాత సత్యాగ్రహాన్ని నిలిపివేసి, గాంధీ అమృతసర్‌లో జరిగిన కాంగ్రెస్‌సభలో రౌలెట్‌చట్టాన్ని అంగీకరించవలసిందని ఓ ప్రస్తావనను ప్రవేశపెట్టాడు. "కాంగ్రెస్, ప్రభుత్వ ప్రకటనయొక్క భావాన్ని అర్థంచేసుకుని బ్రిటీషు ప్రభుత్వము, ప్రజలూ, అధికారులుకూడాకలసి ఒకే ధ్యేయంకోసం పనిచేయాలని కోరుతున్నది. కనుక భారతప్రజలు రాజభక్తితో ప్రభుత్వానికీ, అధికారులకూ సహకరించి రౌలెట్‌యాక్ట్ సంస్కరణలను అంగీకరిస్తూ త్వరలో పూర్ణస్వాయత్త శాసనం

## ఏందిరో

భూపాల్

ఓ.... మల్లయో - ఓ.... ఎల్లయో
ఓ.... నారయో - ఓ.... ఈరయో
ఏందిరో ? ఏందిరో - నువు
సావుదెగ్గరైతవేంది - రన్నోకూలన్నా
నువు చాకులందుకోవేంది - అన్నోమాయన్నా

దుక్కి దున్ను తున్నాడమ్మా
దుక్కి దున్నుతున్నాడూ
చెమట కక్కుతున్నాడమ్మా
చేలుపెంచుతున్నాడూ
అది భూసామిది భూమి
ఆసామికి లేందేమి ?
మొగులంటె మేడవుంది
ఎకురంత ఆకిలుంది
పైసెంట సొమ్ములంట
తీరొక్కవైనపంట

---

ఏర్పరచబడుతుందని ఎదురుచూస్తున్నారు. ఈ సందర్భంగా గౌరవనీయులైన మాంటేగ్యూ తీసుకున్న శ్రమకు భారతప్రజ హృదయపూర్వక ధన్యవాదములు అర్పిస్తూన్నది."

ఖిలాఫత్ ఉద్యమం : మొదటి ప్రపంచయుద్ధంలో జర్మనీ ఓడిపోయింది. మిత్రపక్షాలు (బ్రిటన్-ఫ్రాన్సు-అమెరికా) టర్కీ ఖలీఫాకు కొన్నివాగ్దానాలు చేయ నిరాకరించాయి. ఆసియా మైనర్‌లోని, థ్రేస్‌లోని సముద్రతీర సారవంతమైన ప్రదేశాల్ని ఖలీఫాకు వుంచుతామని మాట ఇవ్వడానికి నిరాకరించాయి. మతసంబంధమైన ప్రసిద్ధక్షేత్రాల్ని ఖలీఫాకు వప్పగించడానికి నిరాకరించాయి. దీంతో ముస్లిం దేశాలన్నింటితోపాటు భారతదేశంలోని ముస్లిముల్లోనూ ఒకవర్గానికి బాధకలిగింది. దీన్ని అదనుగాతీసుకుని ఇంగ్లీషువారికి పరమభక్తులైన అలీసోదరులు ఖిలాఫత్ ఉద్యమాన్ని ప్రారంభించారు. దీన్ని తనస్వార్థానికి వాడుకుంటూ గాంధీ సహాయ నిరాకరణోద్యమాన్ని - ఖిలాఫత్ - ఉద్యమానికి జతచేసి కృత్రిమ హిందూ - ముస్లిమ్ ఐక్యత నినాదంతో, ఆనాటి విప్లవపోరాటాల్ని పక్కదారిపట్టించాడు.

ఆపంట దీసినోడా
ఆకల్లమంట లేందిరో ॥ఏంది॥

బట్టీగాలు తున్నాదమ్మా
బట్టీగాలు తున్నాదీ
పొట్టుజల్లుతున్నాడమ్మా
పొట్టామండుతున్నాదీ
ఇదికుమ్మరోనిబట్టీ
ఇది కులంలేనిమట్టీ
ఆ మూడుతీర్లమన్ను
మైనంగజేస్తివన్న
ఆ నీళ్ళనానబెట్టీ
ఆ జల్లెధేసిపట్టీ
ఆ కుండ కుండగొట్టీ
ఈ గాలికారబెట్టీ
కుండలుజేసెడినీకూ
కుందేగతిలేదురో ॥ఏంది॥

రోడ్డుసాగుతున్నాదమ్మా
రోడ్డుసాగుతున్నాదీ
కార్లు ఉరుకుతున్నాయమ్మా
బస్సుబుస్సుమన్నాదీ
ఇది అబిసాౖపురోడు
ఈడెంతరద్దొజూడు
నీ కండకండకోసీ
ఈ కంకరంతపరిసీ
నీ నెత్తురంతసిలికీ
ఈ సిమిటినంతఅలికీ
రోడేసి తారుపోసి
రోలరులుతిప్పినావు

ఒకనాడారోడుబస్సు
ఎక్కలేవుయేందిరో ॥ఏంది॥

నూలువడుకుతున్నాడమ్మా
నూలూవడుకుతున్నాడూ
చేతులుపీకుతున్నాయమ్మా
ఏకులు పాకుతున్నాయీ
ఇది గుడ్డనేసెమిల్లూ
అదిమైలవడ్డఒల్లూ
నీసూపుసావజూసీ
ఆ సిక్కులన్ని దీత్తవ్
తానుల్లగుడ్డనేస్తవ్
నువ్ తొడుక్కుందిజూస్తే
అది మాస్కెలేన్నగుడ్డ
అది దానితల్లిబిడ్డ
బట్టనేసిపెట్టెటోడ
ఉట్టిపెయ్యదేందిరో ॥ఏంది॥

మేడలుగట్టుతున్నారమ్మా
మేడాగట్టుతున్నారూ
ఇటికెపేర్చుతున్నారమ్మా
గోడలులేపుతున్నారూ
ఇదిఅందమైనపట్నం
పదిలంగదీన్నిగట్నం
ఇవి పెద్దదొరలఇండ్లు
ఆళ్లైరాజ్యమేలుతుండ్రి
నీ బొక్కలన్నిపగిలి
నీ రెక్కలతోవెలిగె
ఆ నక్కనైనఇండ్లూ
సూడంగలేవుకండ్లూ
మేడవాడగట్ననీకు
గుడిసే కరువేందిరో ॥ఏంది॥

# పోడూ.... పోరూ

ఎ. అప్పలాన్డియు

[ఈతసెట్టెక్కి ఈతకల్లు తాగలేదు జాతాపోడు
తాటిసెట్టెక్కి తాటికల్లు తాగలేదు సవరోడు

పోడుగొట్టి, పెద్దకందులు పండించినా.... మిరపముక్క వంజుకోవడమేతప్ప కందులు కూర తిండికి నోచుకోడు గిరిజనుడు.

"ఏజన్సీ యింటరెస్ట్ అండ్ ట్రాన్స్ఫర్ రెగ్యులేషన్ 1917" వున్నా.... ఏజన్సీలో గల భూములన్నీ అప్పులపేర, వడ్డీలక్రింద, శిస్తులక్రింద దస్తులక్రింద యేనాడో పల్లపువ్యాపారులకి దఖలుపడిపోయినవి. గిరిజనుడు.... పాలేరుగానో కూలోడుగానో మిగిలాడు. "ది మద్రాస్ ఎగ్రికల్చరల్ డెట్రిలీఫ్ (Partially excluded areas) రెగ్యులేషన్ 1944" వున్నా వడ్డీల సావుకారిపులులు గిరిజనుల పంటల్నీ, సంపదల్నీ మేస్తూనేవున్నాయి.

"ది ఏజన్సీ డెట్బాండేజ్ రెగ్యులేషన్ 1946" వున్నా తెల్లబట్టలేసిన ప్రతి వాడికీ, పిల్చిన ప్రతిసారీ గార్డు-ఫారెస్టరు తదితర ఆఫీసర్లకీ; కరణాలకీ, కాకీదుస్తుల వాళ్లకీ, అందరికీ వెట్టిచేయక తప్పలేదు గిరిజనుడు.

అనేకానేక చట్టాలు, శాసనాలు, రెగ్యులేషన్లుగాక ఆఫీసులు అధికార యంత్రాంగమూ తంతులా తయారయి.... చివరికి సంపదంతా కొల్లగొట్టేసి గోచి గుడ్డతో మిగిల్చాయి గిరిజనుణ్ని.

గోచిగుడ్డ బతుకుపోవ గొడ్డలి పైకెత్తినాడు. కంబారీబతుకునించి కమ్యూనిజా నికి పయనించినాడు. మంచులాంటి గుండెల్లో మంటలు రగిలించినాడు. ఊరచెరువు లాంటోడు ఉప్పెనే అయినాడు....

సొండీలు, సావుకార్లు, దోపిడిదొంగలు, ఆఫీసర్లు, కర్ణంనాయుళ్లు అంతా పరుగెత్తినారు.... పట్టణాలకు.

దోపిడీలేని, దగాలేని, దౌర్జన్యంలేని, కల్లోలంలేని మరోసుందర చిన్ని ప్రపంచం ఆ ఏజన్సీలో గిరిజనుడు నిర్మించుకున్నాడు. అక్కడ కల్లువ్యాపారి సొండోడులేడు. వడ్డీలకి పంటలుగుంజే పిద్ధాంతిలేడు, ఎత్తుకుముత్తుం తూచి బేరం

జేసి దోచేసావుకారిలేడు. 'కర్రిపుల్లకో కేసు' అని కేకలేసి పీకమీదకత్తిలాగ తైతక్కలాడే గార్డూ.... ఫారెస్టరూలేడు. లేడు.... ఎవుడూలేడు. దోపిడీ, దౌర్జన్యం, దగా పారిపోయింది. పట్టణంలో దాగుంది. ఏజన్సీని ఏలుతున్నాడు గిరిజనుడు. ఎర్రి జెండా వాడికిఅండ ! కమ్యూనిస్టుపార్టీ వెలుగులో అనేక విషయాలు గ్రహించినాడు. సమస్యలూ చిక్కులూ, తగువులూ తంటాలూ సమష్టిగా చర్చించుకోవటం, పరిష్కరించుకోవటం కోసము పార్టీఆధ్వర్యంలో గ్రామసంఘాలేర్పడినయి. ఏజన్సీ అంటే అప్పుడు 'ఎర్రరాజ్యం' 'ప్రజారాజ్యం' అనొచ్చు. అక్కడ బెబ్బలాగపడివున్న గిరిజనులంతా అప్పుడు గొడ్డలి పైకెత్తి నిలుచున్న ఎర్రసైనికులు !

దోపిడీకి రక్షణా, దౌర్జన్యానికీ అసరా ప్రభుత్వంనుంచి కదిలింది. సి.ఆర్. పీ, స్పెషల్ పోలీసుబలగాలు ఏజెన్సీచేరాయి, కల్లోలితప్రాంత చట్టాలు, పోలీసు కేంపులూ, ఎన్‌కౌంటర్లూ అక్కడ అడవిలోని పచ్చటిఆకుల్ని రక్తమయంజేసాయి.

ఏజన్సీలో వలసలు కాలిపోయాయి. ఎందరో గిరిజనుల కుటుంబాలకు కుటుంబాలే కూలిపోయాయి, మరెందరో మానవతుల మానాలు మండిపోయాయి. ఎందరెందరో.... ఎక్కడెక్కడో జైళ్లకు నెట్టబడ్డారు. ఎందరో చెట్లకు కట్టబడి, కాల్చబడి ఎన్‌కౌంటర్ కథలై పత్రికలకెక్కారు. కుట్రకేసులూ, ఉరితీతలూ, యావజ్జీవశిక్షలూ.... కొండలపై చిల్లినరక్తాలు.... బండల్లో ప్రతిధ్వనించే మరణ నినాదాలు.... అయిపోయింది, అంతా అయిపోయింది.

పదమూడేళ్ల క్రిందటి మాటయిది. పదమూడేళ్ల క్రిందటి పోరాటానికి గుర్తుగా కన్నీరుకార్చే సెలయేర్లు, మౌనంవహించిన కొండలూ, ఆవేదన బిగబట్టిన అరణ్యమూ మిగిలాయి.

నేడు పూర్వంలానే వుంది ఏజన్సీ కాదంటే పోలీసుకేంపులు తోడయినవి: కోర్టులు కూర్చున్నవి, అక్కడక్కడా ఆశ్రమపాఠశాలలూ, అభివృద్ధిసంస్థలూ వచ్చాయి. అన్నింటితోడూ ఏజన్సీ కేంద్రాలనుండి పట్నాలకు రోడ్డులేర్పడినవి. బస్సులొచ్చాయి!

యేరోడ్డొచ్చినా "తులిసాలస" రోడ్డుకిమాత్రం బస్సులాలేదు. బస్సురోడ్డు గాదు. అది కాలిబాట ! ఎత్తయిన 'జోగిపురం' కొండదిగువనుండి యిటు పార్వతీ పురానికి కలిపేదారిలోగల "తులసివలస"కు పోయేదారిఅది. ఆ దారినిండా దట్ట మయిన అడ్డాకులతీగలూ, అంకుడుదొంకలూ.... కారుమల్లెపొదలూ.... చెట్లమీదికి పాకే పరింకంపలూ వుంటాయి.]

అదిగో ఆ 'జోగిపురం'కొండ జాలతోవనుండి జాగ్రత్తగా పరింకంప ఒంటికి తగలకుండా, అడ్డాకులతీగలు కాలుకితగలకుండా చూస్తూ, చింతపండు బరువుకి కావిడి భుజాల్నిమంటపుట్టిస్తున్నా, కొండతోవలోని గొడ్రించురాళ్లు పాదాల్ని గీరేసి మండిపోతున్నా. ఎండకి చెమట ఒంటిపైదారకట్టినా, జుట్టుమీదనుంచి చెమట మొహంమీదకొచ్చి.... అప్పుడప్పుడూ నోట్లో పడినప్పుడల్లా.... చెమటా.... ఉమ్మూ కలిపిఊసేస్తూ కొండదిగి 'పులిసాలసతోవ' తప్పించి ఊరిలోకి వస్తున్నాడు బిడ్డిక మంగయ్య.

మంగయ్యది 'తులసివలస'. మంగయ్యని చుట్టుపక్కల వలసలోళ్లూ, దిగువ పల్లపోళ్లూ అంతా "బిడ్డికోడా!" అనేపిలుస్తారు. బిడ్డికోడికి మొలకిచుట్టిన గోచితప్ప ఒంటిమీద గుడ్డమరేంలేదు. గోచీబిగించిన మొలతాడుకి ఎడమపక్కగా గల కర్రిగొట్టంల అర్చిసిన సుట్టముక్కంది. కడుపుకి అంటుకిపోయిన పేగు లున్నాయి. ఒంటిమీద అక్కడక్కడా.... అప్పటి పోరాటకాలంనాటి పోలీసుల చిత్రహింసల గుర్తులున్నాయి. ఇప్పుడు బిడ్డికోడిమనసులో ఎవ్వరికంటాబడకుండా ముఖ్యంగా సవర్రాజు సావుకారికీ. కార్పొరేషన్ ఉద్యోగులకీ కంటబడకుండా ఊరిలోకి, యింట్లోకి చింతపండుకావిడి మోసుకుపోవాలనే ఆలోచనలున్నాయి.

ఎలాగయితేనేమి బిడ్డికోడు ఎవ్వరికీదొరక్కుండా, తోవతప్పించేసి ఊరిలోకి చేరాడు.

యింటిముందర కావిడిదించి, గోచీముందు వేలాడేసిన గుడ్డతోటి మొహంమ్మీది చెమటనీ, భుజాలనీ, చంకల్నీ ఒంగొని తుడుచుకున్నాడు. యింట్లోకెల్లి 'అటికి'లోనున్న చల్లటి గెడ్డనీరు 'డోకి'తోటి తీసి గటగటాతాగి, డోకక్కడొదిలేసి వచ్చి, కావిడికొమ్ముల్నిపి చింతపండు తట్టలు రెండింటినీ గడపలోకి మోసుకొచ్చాడు.

చింతపండు కొనటానికి యీ రోజు కొమరాడనించి జనార్ధనం మేష్టారు వస్తామన్నారు కదా అని ఎదురుచూడసాగాడు గడపలోకూర్చొని. కొంతసేపటికి మేష్టారొచ్చారు. కావిడి చితపండు తూకంవేసారు. గుడ్డివాడిచేతిలో వజ్రాలుంటే యేమహాత్ముడో కాజెయ్యటం మానేస్తాడేమోగానీ.... మానవుడు కాజెయ్యకుండా వుంటాడా? అమాయక గిరిజనులపద్దగల చింతపండుకూడా ఎత్తుకుముత్తుం తూచుకుపోకుండా ఎవ్వరూవుండరు.... కానీ జనార్ధంమేష్టారలాంటివారుకాదు. నిజాయితీ గలవాడు.... ఒకరిది దోచుకొనేవ్యక్తికాడు. మొత్తంలెక్కలేసి "ముప్పయ్యొక్క కేజీ

ఉందిరా బిడ్డికోడా పండు.... పలభయ్యారున్నర సీకొస్తాదిర! కేజీ రూపాయిన్నర లెక్కనేసాను చూసుకోరాలెక్కలు" అని సిగరెట్ డొక్కుమీదరాసిన అంకెలు చూప బోయారు మేస్టారు.

"లెక్కలూ డొక్కలూ నాకేటితెలుత్తాయి మేట్సుగోరో.... ఎంతొత్తదో యిచ్చేయండి" అని చేయిచాపాడు బిడ్డికోడు.

ఇంతలో, కోడిపెట్టని వెంటదగిలే నక్కలాగ జానలేసుకుంటూ అక్కడికి సావుకారి సవరాజు రానేవచ్చాడు.

మంగయ్య చింతపండుని మేస్టారుతెచ్చిన గోనెసంచిలోకి వొంపుతండు.

"ఆగరోరి, ఆగు! ఆగొరే బిడ్డికే. నక్కఎరగనిబొక్కలా? ఓరే మీ కొండోలిమాయలు నానెరగనివా? నీసంగత్తెలిసే, నువ్విలాగ సంతతోవ తప్పించేసి, నా అప్పుకి నామాలెట్టేసి, యిలగ దొంగసాటుగ సరుకమ్ముకుంతావని తెలిసే వొచ్చాన్రా! ఎత్తు, ఎత్తు ఆబస్తా తిన్నగెత్తి, సంతకాడ నా బండిలోవెయ్యి, ఎత్తురా" అని గదిమాడు సవరాజు.

మంగయ్య సావుకారికి ఎదురు పలకలేదు.... బస్తా మూతికట్టు వెదుకుతూ మౌనంవహించాడు.

"ఎత్తమంటే మూతెత్తవేంరా కోడు నాకాడకా? మునిగిపోతునాగ పల్లక తిరగతన్నావేటి?" అని మళ్లీ కేకలేసాడు.

"యీ పండు మేష్టుగారికిచ్చేసినాను సావుకరిబావ్"

"మరి నాబాకీకి నీ పెళ్లాన్నిచ్చేత్తావేటిరా?"

"ఒసేటి సున్నగ గుండయిపోతావు. యేటకేట వొడ్డీ కొలుసుకుంతన్నావు, వొచ్చినపుడల్లా వొట్టిసేతుల్తోెల్లవు.... ఎప్పుడిబాకీ.... ఎంతిచ్చాను.... ఎన్నిచ్చాను.... అయినా బాకీఅంతావు యేటా పికమీద గూకుంతావు"

"యేటీ? యేఁటటి? బాకీ లేదన్ని కాడకొత్తన్నావా? ఓరె, ఓరె కొండోడా! కళ్లపేలిపోగలవురా? తీర్పలేకపోతే, యీయేడుగాపోతే మరోయేడను అంతేగానీ బాకీలేదనకు.... జాకరదేవత సాచ్చిగా, యిదిగీ భూమ్మీద మొలిసిన యీ తుంగ దుబ్బుని పట్టుకొని "సావుకారీ నీకు నేను బాకీలేను" అని ఒక్కముక్క అనీరా అనీసి తుంగదుబ్బు తెంపీరా! సాల్సు ఎల్లిపోతాను. పాపంపున్నెం ఆ దేవత సూసు

ఉంటాది" అన్నాడు సావుకారి. "ఎందుకు.... యీ మాత్రానికి ప్రెమానకాలు.... యిత్తాన్లే నీకు సింతపండిత్తాన్లే! ఈపాలికీ మేష్టర్గోరొట్టుకెల్నీ! ఆడబ్బులవుసిర ముంది, పిక్కరోడికి ఊష్టమొచ్చినపుడు జాకరతల్లికి కోడీకోకా మొక్కుకున్నాము.... కోడీకోకా కొనాల"

"తిన్నగడిగితే మీ కోడోలు నొంగ్రా.... సుబ్బరగా నిన్ను పోలీసు కేంపోలి కప్పజెప్పితే, ఆగోవిందరాజెన్సయి కక్కిస్తాడు నాబాకీ.... పద పదరా కేంపుకాడకి" అని మంగయ్యనిపీకమీద చెయ్యేసి తోసుకువెళ్ళబోయాడు.

"ఈసారికి మంగన్న నొదిలీయండి సప్తరాజుగారూ! పాపం మొక్కుబడి అంటున్నాడు. ఇంకా చింతపండు పంటుందికదా! మీకళ్ళముందుండి ఎటు పోతాడు?" మేస్టారు సర్దిచెప్పబోయాడు. "సాల్సాల్లే.... సెప్పొచ్చావ్. అత్తసొమ్ము అల్లుడుధారోసినట్టుగ నా బాకీకి నువ్వాగమంతన్నావు. యేమి? అంత నమ్మకమున్నోడి వయితే, నువ్విపుడుడబ్బిచ్చీసి.... మరోసారి చింతపండుకి రాకూడదూ?" అని ఎదురుపొడుపు పొడిసాడు సప్తరాజు.

"నిజమే, మంగన్నమీద నమ్మకంలేకకాదు. ఎక్కడ కొమరాడ, ఎక్కడి తులిసొలస, మరోసారి నీను రావాలంటే సెలవుకుదరాల! యింత దూరాభారం రావాల. మీరంటే యిక్కడోల్లే.... యీళ్ళబ్రితుకుల్తో నిత్యసంబంధమున్నోళ్లు గనక మీరు ఆలోచించాల...." "నీకు తెల్దుమేష్ట్రో యీలసంగతి. నాలుగేళ్ళకిందట బావో, పెళ్లంకి జబ్బొంచింది, మందులెయ్యించాలంతే యిచ్చాను పాతిక రూపాయిలు కరుకుల్లాంటి రూపాయిలిచ్చాను. యిచ్చినపుడే సెప్పాను- వోరే! బిడ్డికోడా! సింత పండు సీజన్ల కేజీ ముప్పావలా నెక్కన పాతికకీ ముప్పయిమూడు కేజీలసిల్లర యిచ్చుకోవాలనీ, కండనజేసి మరీచెప్పాను. అలాగిచ్చుకోలేకపోతే, ఆ సీజనాకర్న సింత పండు కేజీ ఎంతధరుంతే, ఆ ధరనెక్కన ఆ ముప్పయిమూడు కేజీల సిల్లరకీ లెక్కగట్టి, ఆడబ్బుకీ మల్లీ సీజన్ల.... సింతపండు కేజీ ముప్పావలాధరని యిచ్చుకోవాలాని! అని సెతపోరుపెట్టి చెప్పాను. ఆడూ అలగలగేనని ఒట్టుకుపోయి, యిదిగో యేట కేటా యిలగేజేత్తండు, బాకీజూత్తే డబ్బయిపయినున్నాది. ఎప్పుడికప్పుడూరుకుంతే, నాకు మరి సింతపండూముట్టదు, నాడబ్బూముట్టదు- ఈసారి కొదల్నుగాకొదల్ను.... పదరా కోడునాకొడకా, సింతపండెత్తురా" అని చింతపండుమూటని ఎత్తి తనకంద జెయ్యమని సప్తరాజు బలవంతం జేయసాగాడు.

నోరులేనిలాంటోడయిన బిడ్డికోడిని దబాయించినందుకో, తను కొనుక్కున్న చింతపండుని పట్టుకుపోజూసినందుకో గానీ సవర్రాజుమీద మేస్టారికోకోపమొచ్చింది.

"అగండే సవర్రాజుగారో, ఆగండి! అదు మీకు బాకీయో, లేకపోతే ఒట్టి పుణ్యానికో బెదిరించి పట్టుకెల్లబోతందో్రి నాకుతెల్దు. ఆ సరుకునాది నేను సొమ్మిచ్చి కొనుక్కున్నాను. నా సరుకుని పట్టుకెల్లడానికి వీలులేదు" అని సాధ్యమైనంత గౌరవంగా మేస్టారు చెప్పారు. "యేటిమేస్ట్రో్రి! నీను బెదిరించి దెంకెల్తన్నానంతావా? ఈసరుకు నీదంతావా? యిదొట్టికెల్లడాంకీలు లేదంటావా? యేటి? నాసంగతైలిసే అంతన్నావా? నాపేరు తెలిసే అంతన్నావా? ఇదిగో నీను తల్చుకుంటే నిన్ను, నిలబడిన పాటుగా పోలీసులకప్పజెప్పేసి, నక్సలయిటువనిసెప్పి, ఈ కొండోళ్లని మల్లీ రెచ్చగొడతన్నావనిసెప్పి, పోలీసులచేత కాలిపించీగల్ను! జాగర్త!" అని బెదిరించబోయాడు.

నిజంగా సావుకారి సవరా్రజుకి అంతబలముంది. సవరా్రజు అసలు పేరు శ్రీరాములు. శ్రీరాములు పాతికేళ్లవయసువరకూ, ఏజన్సీకి పదిమైళ్లదూరానగల పల్లంగా్రమంలో పెరిగాడు. అప్పుడు సవారగా పెరిగిన సర్వేచెట్టులాగ వుండేవాడు. చదువెప్పుడో హైస్కూల్తోటే ఆపేసి ఊరిలో పనికిరాని పోరంబోకుగా తిరిగేవాడు. శ్రీరాములు తిరుగుళ్లకి కళ్లేలుబిగించాలని తండి్ర శ్రీరాములుచేత 'గుణానుపురం' జోగినాయుడుగారి కూతురుమెడలో తాళికట్టించేడు. తాళికట్టిడేకానీ పెళ్లాంజోలికి పోలేదెప్పుడు. ఎప్పుడూ ఊరిమీద 'అప్పడుకోడి'లాగ తిరిగేవాడు, చూసి, చూసి పెళ్లాం.... ఊరిలోని మలేరియా యిన్స్పెక్టరుతో ఒకరాతి్ర లేచిపోయింది. అంతే! శ్రీరాములికి దశతిరిగింది, అక్కడ్నించే తారాజువ్వలా మీదికి లేచాడంటారందరూ!

పెళ్లాం మరోడితో లేచిపోయింది. తండి్ర కొద్దికాలం తర్వాతనే పోయాడు. తల్లెప్పుడో చనిపోయింది. యింటిలో ఆడదిక్కులేదు. అక్కా.... చెల్లెల్లా లేసం దున! అడ్డూ.... అదుపూలేదు అన్నదముల్లేనందున! పెద్దా, చిన్నాతనేఅయ్యాడు. తండి్రచాటున విచ్చలవిడిగా తిరిగిన శ్రీరాములు దొంగచేతికి తాళాలొచ్చినతీరుగా అయ్యాడు. 'అప్పడుకోడి' తిరుగుళ్లకి అడ్డొచ్చింది. 'అప్పడుకోడి' కాదెద్దుగా మారవలసొచ్చింది. కష్టపడాల్సొచ్చింది. ఊరిమీదతిరుగులు మానుకొని యింటి బాగోగులు చూడాల్సొచ్చింది. అంచేత ఎవరిపూచీ, పేచీలేకుండా ఎవరితోనూ కూడ కుండా, కష్టపట్టం, పంటపండించటం, సంపాదించటం యిదే శ్రీరాములు జీవనమయ్యింది ఒక యేడాదిపాటు.

ఊరతిరుగులు తిరిగినప్పుడెప్పుడో కన్నేసి.... వీలుగాక శ్రీరాములు వొదిలేసిన వాళ్లల్లో ఒకామె సావిత్రిమ్మ !

యిప్పుడామె శ్రీరాములుమీద కన్నేసింది.

శ్రీరాములుకి సావిత్రిమ్మవచ్చింది. సావిత్రిమ్మ మెడకీ, చేతులకీగల పద హారు తులాల బంగారంవచ్చింది. అన్నింటికంటే, శ్రీరాముల్ని తనింట్లోనే సాటుగా సుఖపెట్టి, భవిష్యత్తు బ్రతుకుప్లానంతా తయారుజేసి చెప్పిన సావిత్రిమ్మ యొక్క తెలివితేటలూ, ధైర్యమూ మరీబాగానచ్చాయి.

అంతే, శ్రీరాములు సావిత్రిమ్మని లేపుకొచ్చాడు.

సావిత్రిమ్మతో కొన్నాళ్లు, ఆమె తాలూకా కన్నవారిఊరిలో గడిపాడు. ఆ ఊరు ఏజెన్సీకిదగ్గర. అక్కడుండగా సావిత్రిమ్మ ఒంటిమీదిబంగారం కొన్నాళ్లు బ్యాంకులో వుండిపోయింది. అంచేత చేతికి కొంతడబ్బొచ్చింది. ఆ డబ్బుతోటి శ్రీరాములుచేత ఏజన్సీలోని ఆకూ, అలములూ, కర్రా కంపా. పుల్లాపుడకా, యిప్పపప్పూ, వుసిరికిపప్పూ, కందులు కావిళ్లు, చింతపళ్లుకావిళ్లు, తుమ్మబంకా, తుడుసుకొనే కొండచీపుర్లు ఒకటేమిటి దొరకిన ప్రతీవస్తువునీ కొనిపించింది. వాట్ని పట్నాలకీ, పల్లానికీ తోలిఅమ్మించింది. పల్లంలోనీ, పట్నంలోని పకోడీ పొట్లాలు, సుట్టలకట్టలు, పొగాకు, అగ్గిపెట్లూ, కర్రికజ్జిమూ, కంపినీబాడీలు ఒకటేమిటి వింత వింత సరుకులు ఏజన్సీకితెప్పించి అమ్మించింది. అప్పూ సప్పులిప్పించింది.... బాకీ సాకీలు కాతాలునడిపించింది. యిలాగ ఏజన్సీదగ్గర పల్లెలోవున్న శ్రీరాములు.... తర్వాత ఏజన్సీలోకివచ్చేసాడు. అప్పుకింద అపుపడ్డలూ, వొడ్డీకింద వూటమల్లూ, బాకీసాకీలకి బళ్లూ బక్కలూ సంపాదించేడు. కొండల్లో కొలువుదీరాడు. పల్లం భూములూ, పోడుపంటలూ, పాలేర్లూ, కూలోళ్లూ, లెక్కలేనంత భూమి, డబ్బూ, సంపదా, హోదా సంపాదించి అదిగో ఆ ఏజన్సీల "సవర్రాజు" అయ్యాడు. సవ ర్రాజు అవటంకాదు సావిత్రిమ్మ 'సవర్రాజు'గా చేసింది. అలాచేసేందుకు దీక్ష బూనింది. ఆ దీక్షతోటే ఫారెస్టాఫీసర్లనీ, కార్పొరేషనధికార్లనీ, పోలీసుద్యోగుల్ని ఎందర్నో సన్నిహితులు చేసుకుంది. రాజకీయాలజోలికిపోకుండా అధికార ప్రతి పక్ష నాయకులకు నమ్మకస్తురాలైంది అందరికీ సన్నిహితురాలై, అందరినుండీ పిండగలిగిన లాభం పిండుకోగలిగింది. అలా పిండుకోగలిగి, ఆ కొండల్లో శ్రీరాములుని 'సవర్రాజు'ని చేసింది.

యింతటివారుగూడా, ఆ రోజుల్లో.... గొడ్డలి తిరగేసిన గిరిజన పోరాటకాలాన, పట్నంపారిపోయి దాక్కొన్నారు. ఏజన్సీని మర్చిపోండ్రి- భూమినీ, పుట్టనీ, యిళ్లనీ, బళ్లనీ, భాగ్యాన్నీ వదులుకుండ్రి! ఎందరెందరో పోలీసుల తుపాకీవల యాలమధ్య త్రుళ్ళిపడి, బెదిరి, నిద్రలేచే రాత్రుల్తోపట్నంల గడిపారు. ఎంతరాతి గోడల భవంతిలోవున్నా, ఎన్ని ఉక్కు-శిరస్త్రాణాల తుపాకీల రక్షణలోనున్నా గుండెల్లో భయమే! ఆస్తిపోద్దనే భయం! ఆయుస్సు పోద్దనేభయం! భయపెట్టినన్నాళ్లా భయపెట్టి ఏజన్సీలో రాజులాగ, రాణిలాగ బ్రతికినవారి గుండెల్లో అహరహం ఆందోళనే! త్రుళ్ళిపడిలేచే రాత్రుళ్ళు, నీడనిచూసి హడలిపోయే ఎన్నోపగల్లు గడిచిపోయాయి. మళ్లీ యివ్వాల మామూలే! పాతచరిత్రే పునరావృతమవుతోంది. యివ్వాల ఏజన్సీని కలిపేసుకు తిరిగేస్తున్న బస్సురోడ్లూ, టెలిగ్రాఫిక్ ఆఫీసులు, పోలీస్టేషన్లూ, కేంపులూ, కల్లోలితప్రాంతాలు, కుట్రకేసులూ, ఎన్‌కౌంటర్లూ, లాకప్పులూ, లాఠీలు, తుపాకులూ శ్రీరాములు షావుకార్ని మళ్లీ ఏజన్సీలో 'సవర్రాజు'గానే నిలబెడుతున్నాయి. మరింత ధైర్యాన్నిస్తున్నాయి.

ఆ ధైర్యంతోనే మేస్టార్ని భయపెట్టబోయాడు. అయితే మేస్టారు భయపడ్లేదు. బతుక్కి బడిపంతులే అయినా బంధుత్వం పెద్దలెవెల్లోవుంది. ఒకర్ని లెక్కజేసేరకం గూడాకాదు. అంచేతనే "వెళ్ళవయ్యా, వెళ్లు! నువ్వు సవరాజువో సత్తిరాజివో నాకు తెలీదనుకోకు. నీబతుకు పూరాగా నాకుతెలుసూ. నాదగ్గిర డాబుజెయ్యకు. కోడోడ్ని గాదొడికి పోవడానికి! నేనుతల్చుకుంటే నీ యాపారాన్ని యీ అడివిల అగ్గెంట్టించేసి, అంటించీగల్ను జాగర్త! కొండోలుకాడ బిగిరినట్టు నాకాడ బిగరకు వెళ్లు, వెళ్లు చింతపండొదిలీసెళ్ళు. చింతపండు మూటమీద చెయ్యేసేవంటే చిదక దంతాను"అని రకరకాలుగా భయపెట్టి, వార్నింగులిచ్చి అదరగొట్టీసాడు మేస్టారు సవరాజుని.

సవర్రాజుకు కరెంటుషాకులా తగిలాయి మేస్టారిమాటలు. మేస్టారు "నువ్వాద సత్తెప్పవేగానీ, సవర్రాజువి కావ"న్నందుకు రోషమొచ్చింది; "యాపారానికీయడివిల అగ్గెట్టీసీగల్ను"నేసరికి అంపరమెత్తింది, "సింతపండు మూటమీద సెయ్యేత్తే సితక దంతా"ననేసరికి దడపుట్టేసి ఒడుకొచ్చేసింది. మరేమన్లేక, తలదించుకొని, మొహం మాడ్చుకొని.... చేతకాని నక్కలాగ నడిచాడు అక్కడి నుండి సవర్రాజు.

మేస్టారి హెచ్చరికల్తో తోకముడిచిన సావుకార్ని చూసిన బిడ్డిక మంగయ్యకి ఆనాటి గిరిజన సంఘం గుర్తుకొచ్చింది.

అప్పట్లో ఒకసారిలాగే.... ఎవరింట్లోనోదూరి దోతరుపుగా కందులెత్తుకెళ్ళబోతుంటే; సంఘపోల్లువొచ్చి అటకాయించి, ఆ సావుకార్ని తిన్నగా వొలసమొగానున్న చెట్టుకాడకి లాక్కొచ్చి ఆచెట్టుమీదున్న "ఎర్రజెండా"ని చూపి "జాగ్రత్త అటుచూడు, చూసావుగా ఎర్రజెండా, యీవొలస సంఘమయ్యింది. ఇక్కడ నువ్వు దోతరుపూ, దోపిడీలుసేస్తే నీపనయిపోద్ది" అని హెచ్చరించిన సంఘటన మనసులో కదిలింది. సావుకారి కూడలెత్తిపారిపోయినతీరు గుర్తొచ్చింది, పిడికిలి బిగుసుకుంది చేతిలోని డబ్బులం వొంగిపోతోంది. అదిజూసి మేస్టారు "బిడ్డికోడా! యేటి డబ్బులం వొంచేస్తన్నావు. బస్తా కుట్టీడిపయిపోయిందిగా, యేటలగ ఆలోసిత్తన్నా"వని పిలిచాడు. బిడ్డికోడు అప్పుడు మామూలుగా అయ్యాడు. ఆలోచనలాపాడు.

"లెగు, లెగు మూట కొమరాడోలి బండిమీదేసీ; యిదిగో నీకురావాల్సిన డబ్బులు" అని మేస్టారుడబ్బిచ్చాడు.

డబ్బందుకొని, మొలగోచీలదోపుకొని, మూటని వీధిలోని బండిమీదవేసాడు.

* * * *

పొద్దుపోయింది. 'తులిసొలస' నిండా చీకటి అలుముకుంది. పోడులమీదక్కాడక్కడా డబ్బాలు మోగుతున్నాయి. చింతల్లోంచి చింతగీర్లు గీ పెడుతున్నాయి. అల్లక్కడెక్కడో నక్కలు ఊళలేస్తున్నాయి. బిడ్డికోడు గంటిజావ, పులుసుకలుపుకొని, పిండివాడియం ముక్కనంచుకొని తినీసిలేచి, గడపల నులకమంచంవాల్చి వారబడ్డాడు నిద్రకి! పెళ్లాం "సుక్కి" గిన్నిలూ, డాకలూ కడుక్కుంటోంది! పక్కింట్లో "పేసిని"గోడు "అంబాతకాదే.... ఆజామనాడీ" కూనిరాగం తీస్తండు. వీధిమొగాన కుక్క ఎందుకో అరుచుకొని పారిపోతోంది!

వీధిలో టార్చిలైట్ల వెల్తురుపడుతోంది. బిడ్డికోడి మంచంపైన బడింది. బిడ్డికోడి మొహమ్మీదపడింది. కళ్లతెరిచాడు. వెల్తురు ఆరిపోయింది. ఎదురుగా లాఠీలెత్తి నిలబడ్డ ఆమానుబాప్లు.... మేకపీకమీదకి కత్తెత్తిన కసాయోల్లాగున్నారు.

గభాల్న మంచందిగాడు ఒడికిపోతూ బిడ్డికోడు! "యేటార్రి బిడ్డికోడా! గుద్ద బలిసిందేటార్రి గుద్దకొడకా: సర్కారు నెదిరిత్తావటార్రి? సంఘపోల్ని పిలత్తన్నావటా? మీటింగుపెడతన్నావటా? యెవుడామేస్టుర్రి? యేడార్రి?" అన్నాడో పోలీసు, మాటల్లో కావలసినంత కాకీభాషని ఉపయోగిస్తూ!

బిడ్డికోడు హడలిపోయాడు. ఓయమ్మ సావుకారో! అనుకుండు: "ఓరె! మీకింకా బుద్ధిరాలేదుర! పెద్దోలితోటి తగువులొద్దరొ్రి! అంటేయిస్రికదా! పెద్దోలితోటి తగువంటే, అలతరుపు పెబుత్వందిగుతాది. పెబుత్వంతోటి యుద్ధం చెయ్యడంకి నీ పార్టీవోలికాడ, నీకాడ ఏటున్నాయి? ఏటంబాంబులున్నాయా? మిషన్ గన్నులున్నాయా? మిలటీ్రివున్నదా? యేటున్నాది? యేటీలేదు- మీవోలెవులికీ శేటు సితకల్లేవు. చేతికర్రిలుతప్పా మరేట్లేవు. మరి మీలాటోళ్లు గవిర్మెంటుతోటి ఎన్ని జన్మలెత్తి దెబ్బలాడినా మీకు సావుతప్పదరొ్రి! సావుతప్పదు! సావరా నాకొడకా! నిన్నిప్పుడు సావగొడితే యీ వొలసోల్లికి బుద్దొస్తాది," అని లాఠీల్ని బిడ్డికోడిపై నాట్యంజేయించి, బిడ్డికోడ్ని పోలీసుకేంపుకి లాక్కెల్తున్నారు.

యేడుస్తున్న సుక్కితోను, బెదుర్తూ, జాలిగా బిడ్డికోడ్నిజూసే వలసోల్లతోను "జాగర్తోరొ్రి! జాగర్త! యింకెప్పుడూ యీ వొలసల మాకు, సవరాి్రజుకీ, గవిర్మెంటుకీ ఎదురుపలక్కూడదు. ఎవులేనా సంగంకవుర్లు యిక్కడాడితే సావు తప్పదు.... మీ తల్లోని పేలుగూడా దూడలెత్తిపోవాల జాగర్త" అని హెచ్చరించి బిడ్డికోడ్ని పట్టుకుపోయారు.

రాతి్ర చాలాపొద్దుదాకా బిడ్డికోడు పోలీసుల పైశాచికత్వాన్ని అనుభవించాడు. గతంఒడిలోను, భవిష్యత్తు భయంలోనూ ఒళ్ళు పచ్చిపుండుకాగాతెల్లగా తెల్లవారింది.

పోలీసువారికొక కోడి లంచంయిచ్చుకునే షరతుపైనా, శ్రీరాములు సాహుకారి బాకీతీర్చేసే పూచీపైనా తెల్లవారి మంగయ్యని పోలీసులు విడిచిపెట్టారు.

పచ్చిపుండయిన ఒళ్లతోటి యిళ్లజేరిన బిడ్డికోడ్నిచూసి వలసంతా మూగగా రోదించింది.

సుక్కి చేతిమొటిమలువిరిచి పోలీసులతిట్టింది. బిడ్డికోడు మల్లీ మామూలు మనిషికావడానికి రెండోర్రిజులుపట్టింది.

మామూలు మనిషయ్యాక మల్లీ సవరాి్రజుబాకీ, పోలీసులకోడీ గుర్తుకొచ్చాయి. "కోడిపుంజుంది గానది జాకరతల్లికి మొక్కుతున్నది. మొక్కుతీర్చపోతే.... అమ్మోరిక్కోపం! కోడివ్వపోతే పోలీసులక్కోపం.... ఏటిసెయ్యడం?" అనాలోచించుకుంటూ, అంతకుముందేరగా మిగిలినచెట్లకున్న చింతపండు యేరుకొచ్చేందుకు బయల్దేరాడు మంగయ్య. చెట్లన్నీయేరితే బరువుగా ఒక కావిడయ్యింది. బతికుంతే బలుసాకుతిని బతకొచ్చుగానీ సవరాి్రజుబాకీ మరుంచగూడదు, తీర్చేయాల అని

అనుకొండూ, చింతపండుకావిడ్ని సవరాృజుకి అప్పజెప్పేందుకు కావిడిమోస్తూ దారితీసాడు.

కోలగూడొదిలీసి తిరిగే కోడిపిల్లని తన్నుకెలిపోయే గెద్దలాగా మంగయ్యమీద పడ్డారు కార్పొరేషన్‌వారు. "పటో్రిరె- కొండనాకొడకా! చింతపండెటురా ఒట్టు కెల్తన్నావు? మీరిలాగ సాటుమాటుగ సరుకంతా అమ్మీయండి. గుడాంకట్టించి గూచున్న మా కార్పొరోసనోలిమి యీగలుదోలుతాం. మిమ్మల్నుద్ధరించడం ఆ గవిర్మెంటు గాదుగదా, దానబ్బతరంగాదురా" అనికూడా తేల్చేసి, వాడ్ని ఉద్ధరించేందుకు బిడ్డికోడ్ని చింతపండు కావిడితోపాటుగా, కార్పొరేషన్ గోడౌనువద్దకి లాక్కుపోయారు కార్పొరేషనువారు,

ఏజన్సీలోగల పంటలు వ్యాపారులు దోచుకుంటున్నారనీ, పట్నంలోని సరుకుల్ని అధికధరలకమ్మి గడిస్తున్నారనీ దానివల్ల గిరిజనులు నష్టపోతున్నారనీ, వార్ని ఉద్ధరించేందుకు ప్రభుత్వంవారు అక్కడ గిరిజన కార్పొరేషన్ గొడాం పెట్టించారు.

చింతపండు తడితడిగావుందనీ. ఎండితే తూకందిగిపోద్దనీచెప్పి, అంత బరువుకావిడ్ని పదారుకేజీలకు తూచారు. కేజీ రూపాయి పదిపైసల్లెక్కన, పదిహేడు రూపాయల, అరవైపైసలు చేతిలో బిడ్డిపెట్టికోడ్ని ఉద్ధరించారు కార్పొరేషన్‌వారు.

మంగయ్యకి మతిపోయింది. "యేటిసెయ్యడం? సవరాృజు సంపేత్తాడు గావాల! యీడబ్బులిత్తే వొడ్డీకింద గుటకలేస్సి. అసలేదిర నాకొడకా అని ఎగిరి గెంతుతాడు. ఏటిసెయ్యడం" అని ఆలోచిస్తూ దిగాలుగా నడుస్తున్న మంగయ్యకి, తనయింటిముందు కేంపు ఎస్సయి, జమాన్లిద్దరూ నిలబట్టమూ, లాఠీలూపటం కన్పించింది. సుక్కివారితో యేఁవిటో అంటోంది చేతులూపుతూ. మంగయ్యకి యింటివైపు అడుగుపడలేదు. కాళ్లవతికిపోయి, గొంతు ఎండిపోయి తడారి పోతంది! యింటివైపు సూడకండా, తోవదప్పించీసి, అడివిలోకి పారిపోసాగాడు. ఎండ మండిపోతోంది. పిట్టఅలికిడిలేదు. పోడుమీంచి వేడిగాలికి ఎండలో నీడలు పరిగెడ్తున్నాయి,

యింటికాడ పోలీసులు మంగయ్య భార్యని కోడిపుంజుయిమ్మని అడుగతండ్రి సుక్కి "బావో! జాకరదేవతకి మొక్కినాము. వొల్లగాదం"టోంది. అయినా ఎస్సయి పుంజుపట్టుకోమని జవానుకీ ఆర్డరేసాడు. జవాను టోపీతీస్సి, చేటలాగపట్టు

కాని "ద .ద..ద. దా.." అని కోడిని చేటలోకి పిలుస్తూ ఒంగొని కోడివైపు నడుస్తుండు. దగ్గిరికెల్లేసరికి రెక్కలుటపాటపా కొట్టుకుంటో కోడిఎగిరిపోతోంది. మల్లీ వొంగొని నడుస్తుండు పిలుస్తూ.... మల్లీకోడి అల్లంతదూరం ఎగిరిపోయింది రెక్కలుగొట్టుకుంటూ. కోడిపుంజు ఎంటుర్కలు రెండురాల్సింది.... అంతే! ఏడ్సుకుంటూ, జవాను వెనకాల గోలజేస్తున్న సుక్కిని ఎస్సయి లాఠీతో పొడిచి తోసేస్తూ "గోలసెయ్యకే కోదులంజకానా! పుంజెగిరిపోతాంది! నోర్మూసుకో" అని కేకలేస్తుండు. మొత్తానికి కోడిదొరకలేదు. కోపంతో సుక్కిని లాఠీతో చితకబాది "సాయింత్రం కోళ్లమూస్తారుగదా, అప్పుడు పట్టుకొనివొచ్చి కేంపుకాడ యివ్వాల్లమను నీమొగుడ్ని! లేకపోతే, నిన్నూ, నీమొగిడ్నీ కేంపులమూస్సి పులుసొండుకు తినేస్తాను మీ ఎముకల్ని" అని అరుస్తూ వెళ్లిపోయారు పోలీసువారు. ఇదంతా ఊరుగూ.... పొరుగూ, వీధివారూ, వలసలోసంతా చూస్తుండ్రి. గుండెల్లో కోపం రాజుకొంటోంది. అయినా భయం! భయంకరంగా తమపై జరిగిన మారణకాండ, ఛిన్నాభిన్నమైన వారి సంఘమూ తల్చుకొని, కంటనీరుగార్చారు తప్ప, పంటపెదవి నొక్కుతూ పల్లెత్తి మాటన్లేకపోయారు పోలీసుల దౌర్జన్యంపై!

పోలీసులు పోయాక అంతా గుమిగూడారు. తలాఓవిధంగా వారిభాషలో గొణుక్కుండ్రి. సంఘం మల్లీ నిలబడాల! మల్లీ కత్తులూ గొడ్డల్లంతాపట్టాల! యిక్కడ ఏజన్సీల మనందప్ప మరెవడూ వుండగూడదు. అప్పుడే మనకి బతుకనుకుండ్రి.

పోలీసులభయంతో అడివిలోకి పారిపోయిన బిడ్డికోడు పొద్దుపోతున్నవేళ తిరిగొస్తున్నాడు వలసదారిబట్టి. తోవలో ఒకచోట 'ఈళ' సన్నగావిన్పించింది. బిడ్డికోడు ఆగిపోయాడు. చూస్తే పక్కగా పొదల్లోంచి ఒకమనిషి. భుజానసంచీవుంది. నవ్వుతూ ఎదురుగా వస్తున్నాడు.... దగ్గరయ్యాక మంగయ్య పోల్చుకున్నాడా వ్యక్తిని. పోల్చాక, ఆనందంపట్టలేక, మంగయ్య ఆ వ్యక్తిని కౌగలించుకున్నాడు. "కామేరి! నువ్వాకామేరి! అబ్బా ఎన్నాళ్ళకి కామేరి.... ఎన్నేళ్ళకక్కనిపించావు. నువ్వేటయిపోనావోతెల్దు. ఎక్కడున్నావోతెల్దు.... సూడుకామేరి సూడు మా బతుకులు. యింతమంది యిన్ని బాధలనుభగించినాక మల్లీ మా బతుకులు మొదటికొచ్చినాయి. మల్లీ కొండలమీద వొడ్డీలపులులూ, తెల్లబట్టలనక్కలూ, పోలీసుకుక్కలూ తిరగతన్నాయి. మల్లీ మమ్మల్ని సీరుకుదింతన్నాయి. మీరులేరు. సంగములేదు.... తల్లిలేనిబిడ్డలమయినాం. సెప్పుకామేరి, సెప్పు. యిన్నాళ్ళేటయినావు? ఎక్కడున్నావు? సంగతులన్నీ సెప్పు." అని ఉక్కిరిబిక్కిరిగా అన్నీ ఒక్కసారిగా అడగ సాగాడు మంగయ్య.

మంగయ్య బాధనీ, సంతోషాన్నీ అర్థంచేసుకున్నాడావ్యక్తి. "చెప్తాను కామ్రేడ్. అన్నీచెప్తాను. ఇన్నాళ్లూ నేనుగూడా జెయిల్లోనున్నాను. మూడ్రోజులకిందట, వాళ్లు దాకి కోర్టుకితెస్తుంటే, చిన్నఅవకాశంకల్గి తప్పించుకొచ్చీసాను. మన కామ్రేడ్లింకా ఎంతోమంది జైళ్లల్లో శిక్షలనుభవిస్తండ్రు. మొత్తం యీ ఏజన్సీని తుపాకుల్తోటీ, పోలీసుల్తోటీ ప్రభుత్వం నింపీసిందికదా! దొరికినోడ్ని దొరికినట్లగా కాల్చిచంపింది. పార్టీలో అనేకులు కాల్పులకో, జైలుశిక్షలకో గురయ్యారు.... దాంతోటి పోరాటం దెబ్బతిన్నాది. నాయకులెంతమందో అమరులయ్యారు. కార్యకర్తలు ఎన్నోనిర్బం ధాలనుభవించారు. మన గిరిజన గూడలు భస్మీపటలం అయిపోయాయి.... ఈ పరి స్థితుల్లో మనపోరాటం కొనసాగింపు యిక్కడ జరగలేదు. అయితే నేడు మల్లీ దేశంలో అనేకచోట్ల బీహార్, బెంగాల్, తమిళనాడు రాష్ట్రాల్లోను, మన ఆంధ్రాలో కరీం నగర్, అదిలాబాద్, ఇంద్రవెల్లి చాలాచోట్ల ప్రజలు తిరగబడుతున్నారు. మన పార్టీ యీ పోరాటాలకి నాయకత్వం వహిస్తంది." యిలా తోవపొడల్లా అనేకవిషయాల్ని చెప్తూ, ఏజన్సీగురించి కనుక్కుంటూ, "మల్లీ మనం గిరిజెనసంఘం నిర్మాణం చెయ్యాల! దుర్జనులకెదురు నిలవాల! మనకి పోయేదేటీలేదు. మనసంఘం మల్లీ ఆయుధాలెత్తితే, ఆ సవర్రాజు సావుకారిపోతాడు, యీ సొండోడు పోతాడు, ఫారెస్టోడుపోతాడు, పోలీసోడుపోతాడు.... యీ దుర్మార్గమైన ప్రభుత్వం పోతాది. మనరాజ్యం మనకొస్తాది" యిలాగ మంగయ్యని ఉత్సాహపరుస్తూ, తులసి వలస ముందున్న గూడలో ఆగిపోతూ, అక్కడిఉయ్యికి భీముడింట్లో రాత్రికి సమావేశమయ్యేందుకు "తులిసొలస"లోని ప్రజల్నీ, అప్పటి సంఘబాధ్యుల్నీ తీసుకు రమ్మనిచెప్పి మంగయ్యని పంపించాడా కామ్రేడ్.

పొద్దు పూర్తిగా వాటారిపోయింది. కోళ్లు గూళ్లజేరాయి. పశువులు సాళ్లు జేరాయి. పక్షులు గూళ్లజేరాయి. మంగయ్య ఉత్సాహంతో జోరుగా అడుగులేస్తండు. 'తులిసొలస' చేరాడు.

ఇంటివద్ద భార్యయేడుస్తూ పోలీసుల వృత్తాంతం చెప్పింది. ఇరుగూ, పొరుగూ గుమిగూడి "యిదిగీ తీరవనిక మనం భరించలేము. పండిన పంటల్నాసావుకోర్లు గుంజుకుంతండ్రు. పెంచిన కోడీ, మేకల్నీ పోలీసోల్లు గుంజుకుంతడ్రు. కర్రపుల్లదెత్తే అగార్డు దెంకెత్తండు.... యిదిగీ అన్నాయింగాక మనల్ని కొట్టుకదింతండ్రింకా. యిలపింటి బతుకు బతికితేల?" అని అంతా కోపంతో ఊగిపోతూ మంగయ్యతో మాట్లాడసాగారు.

అంతావిన్నాక మంగయ్య "లేదరాౌ. లేదు.... మనమీబతుకు బతకక్కర్లే! యీ బాధా బందిరనుభవించక్కర్లేదు, మనకి మల్లీ మంచిబతుకొత్తాది. మన సంఘం మల్లా నిలబడతాది! మన కామ్రే.... ఒచ్చాడు. సేనా సంగతులు సెప్పాడు ఉయ్యేకి భీము డింటికాడకి మన ఒలసోలిని తీసుకొని రమ్మండు అక్కడన్నీ సెప్తాడు. రండి, రండి" అని కామ్రేడ్ గురించి చెప్పబయల్దేరదీసాడా వలసోల్లని.

పోలీసుల గురించి మర్చిపోయారంతా! వారిలో అప్పటిదాక గూడుకట్టుకున్న భయం, నిరాశా, నిస్పృహా, అచేతనత్వమూ అంతా ఎగిరిపోయింది. నూతనోత్తేజం నిండుకున్నది. పక్కవలసలోని "కామ్రే"ని కలుసుకున్నారా రాత్రి,

* * * *

తెల్లవారింది! కోళ్లన్నీ పెంటమీదబడి కెలకనారంభించాయి. మెరకలమీద పచ్చగడ్డి దుబ్బులు కొరుకుతున్న పశువులు, దుక్కలుదున్నే శబ్దాలు విన్పిస్తున్నాయి. పోడుమీద జొన్నకంకులు లేతఎండలో మెరుస్తున్నాయి. కొండలమీంచి నల్లటిమేఘాలు పారిపోతూ.... ఎండపడినచోటల్లా కొండలు ఎరుపెక్కుతున్నాయి.

'తులసొలవ' బిడ్డిక మంగయ్య యింటిముందు కేంపుఎస్సయి, జమాస్తా, సవరాజూ నిల్చున్నారు. సవరాజు యింట్లోకి ఒంగొని "ఓరె: బిడ్డికీ! రారారా.. రారివతలకి" అని పిలుస్తుండు.

బిడ్డికోడు రాలేదు, జవాబూరాలేదు. ఇంటిముందటి ద్వారంకి కట్టినతడక తన్నుకొని పిల్లి పరుగెత్తుకొచ్చింది. "కోడునా కొడుకెటుపోనాడు?" అన్నాడు సవరాజు. ఇరుగూ, పొరుగూ ఎవరూ అలికిడిలేరు. ఎక్కడో అల్లావీధిచివర్న ఎవడో ముసిలోడున్నాడు. ముంగటి కాళ్లక్లమొకం ముడుసుకొని కూర్చుండు. వాడ్నిపిలుస్తే, వాడు వులుకూ, పలుకూ లేకుండా చుట్టఅడ్డపొగేసుకొని, మొహమటు పక్కకుతిప్పేసి తిరిగిపోయాడు, "కొండనాకొడుకు లెవులలికిడ్లేరు, కోడిపుంజేటయ్యిందో, సూడింరా ఇంటిలదూరి" అన్నాడు ఎస్సయి జవాన్తోటి.

"కోడిపుంజుకేటి గాబరా! ఆడు, ఆడిబాబూ వొట్టుకొత్తాడు. నా బాకీ సంగద్దేల్సవయ్యా, ఎస్సయియ్యా!" సవరాజు. "ఏసంగతి జూస్తామూ? నీకద్దేటి? నా కొడుకెవ్వడ్లేడు గావాలంటే యింటిలదూరి దొరికింది దొబ్బు.... అడిగినోడిపని నేను పడతాను, యేటి?" అని సవరాజుని పురమాయించాడు.

సవ్రరాజు, జవానూ యిద్దరూ వేర్వేరు అవసరాలపైగుడిసెలో దూరబోతుంటే, అడ్డపొగేసి గూకున్న ముసిలోడువొచ్చి" యిదేటి బాప్‌లో, ఎవుల్నేకండా యింటిల దూరిపోతండ్రు.... తప్పుగాదా ? బిడ్డికోడొత్తే.... మంచిదిగాదుమల్లా" అని అడ్డుకోబోయాడు.

"ఎవడ్రీ ముసిల్నష్టికొడుకు ? ముడుకులిరగదంతేసరి : ఆ బిడ్డికోడి సంగతి కాదుగానీ, నీసంగతిజూడ్రా"అని ఫెడేల్‌మని ముడుకులమీద లాఠీ బలంగా వేసాడు ఎస్పయి.

దెబ్బకీ ముడుకులు విరిగినట్లన్పించి "మొర్రో"మని మొత్తుకుంటూ ఎస్పయి కాళ్ళ మీద పడ్డాడు. ఎస్సయి అందిన కడల్లా కాల్తోతన్నసాగాడు. సవర్రాజు, జవాన్లూ యిలటిందూరారు.

యిళ్ల మూలమూలల్లా వెదికారు. యేమీలేదు. దాకలూ దోకిలూ, తట్టలూ బుట్టలూదప్ప ! కోలగూడు కాలీగుంది. కోళ్లు కళ్లాలమీదకెప్పుడో వెళ్ళిపోయాయి. సవర్రాజొక చోలువేసుకొనే గూనలో చెయ్యిపెడితే కర్ర తగిలింది. దాన్నితీసాడు. ఆ కర్రకు ఎర్రటిగుడ్డ చుట్టేసివుంది. గుడ్డవిప్పారు. ఎర్రజెండా ! సుత్తీకొడవలి గుర్తులున్న ఎర్రజెండ! కొండ.... కొండని కదిలించిన ఎర్రజెండా.... దొరికింది.

జవానూ, సవర్రాజూ దాన్ని బయటికిదెచ్చి ఎస్పయికి చూపిస్తూ "చూడండి, నా కొడుకుల కింటిల సోలడుగింజల్లేవు, ఒక గుడ్డముక్కలేదు. ఒక గిన్నెలేదు.... గానీ నా కొడుకు జాగర్తగీజెండాని గూనల దాచివుంచాడు. అంటే యీ నా కొడుకులీ వాలసోల్లందరికీ యీ జెండామీదంతా ప్రేమవుందన్నమాట ! మళ్లీలు జెండాబడ్తారన్న మాట కదా" ! అని అడిగాడు సవర్రాజు ఎస్పయిని !

ఎస్పయి ఆ జెండాలాక్కొని దాన్ని ఎత్తిపట్టుకొని, మరోచేత్తో ముసిలోడ్ని నిలబెట్టి "పడతారు పడతారు.... జెండాలు ఈ నా కొడుకులుపడితే.... మేము తుపాకీలు పడతాము. పిట్టల్ని కాల్సినట్టగ కాల్చుతాం. సూడిరిగో ! నీముందరే ఈ జెండానీ, ముసిలోడ్నీ కలిపి అగ్గిబెట్టి తగలబెడతాను" అనీసి అగ్గిపెట్టె దీసాడు.

ముసలోడు గగ్గోలుపెడుతూ, బతిమాల్తున్నాడు. యింతలో ప్రళయఘోష విన్పించింది. మంగయ్య యింటిచుట్టూ, పోలీసులచుట్టూ, సవర్రాజుని కలుపుకుంటూ కర్ర, కత్తి, గొడ్డలీ పట్టిన గిరిజనులు కన్పించారు.... వినాదాలిస్తూ !

అందరికంటే ముందున్న మంగయ్య మండిపోతూ గొడ్డలెత్తి ఎస్సయిమీదకి వచ్చాడు. ఎస్సయిచేతిలో అగ్గిపెట్టె ఆరిపోయింది. ఎర్రిజెండా వొదిలీసాడు. ముని లోడు దాన్నందుకొని చెయ్యెత్తి ఎర్రిజెండా ఎగరేసి ఏదో అరిసాడు.

మంగయ్య "ఎస్సయ్యో్యరెస్సయి, కాస్కోరోరె కాస్కోరా! నువ్వూ నీ తుపాకీ మావోళ్లని సంపింది, మా ఎముకలిరిసింది, మమ్మల్నిజెయిల్లలోకి లాకెల్లింది. మమ్మల్ని యిదిగో యీ దొంగనాకొడుకుల (అని సావుకారి సవర్రాజుని యీడ్చు కొచ్చి చూపి) కాళ్లకిందేస్సింది, మా భూములు మాకొదిలీసి, మా సంపదలొది లీసి, మామీద అధికారాలొదిలీసి పట్టణాలు పారిపోయిన్నాకొడుకులికి గవర్మెంటు, గవిర్మెంటుపంపిన మీ తుపాకులూ ఊతనిచ్చాయి. యీ వలసల్ల మళ్లీ దొంగ నా కొడుకుల్ని నిలబెడతన్నాయి.

మా గురువుని సంపినారు.... అన్నల్నీ, అక్కల్నీ, తమ్ముల్నీ, సెల్లెల్నీ సంపినారు. అడివిలోని పచ్చనిఆకుల్ని రక్తంలముంచారు.

ఆ రక్తమింకా ఆరనేలేదు. మీరు రాబందుల్లాగా మమ్మల్ని బతికుండగా పొడుచుకుతింటండ్రి.

ఇక్కడ్నించి, ఈ వలసలనుండి, ఈ కొండలనించి యీ సావుకార్లు, అలకి దన్నిచ్చే మీ గవిర్మెంటు, మీ తుపాకులూ పూరాగాపోవాల! మీరు దుంపనాశనం అయిపోవాల! మీ గవర్మెంటు కూలిపోవాల! అదిగో అంతదాకా పోరాడతాం....

అన్నలెంతోమంది పోనారాని, బాధలెన్నో అనుభగించామని పోరాటంఆపము. ఇంటిపెద్ద చచ్చిపోతే పోడువ్యవసాయిం చేయటం మానుకుంతన్నామా? తరాతోలిమి సెయ్యటంలేదా? అలిగే! మా బతుకులు బాగయ్యేదాక, మా సంఘం రాజ్యమేలే దాక మేము పోరాడతానే వుంతాము.... మీరుచేసిన రక్తమండలానికి అంతా మరంతా బదులుతీరుత్తాము.... కాసుకోరా- కాసుకో" అని గొడ్డలెత్తాడు. ఆదెబ్బకి దొర క్కుండా, జనంకాళ్లల్లోంచి తప్పించుకు పారిపోసాగాడు ఎస్సయి. సవర్రాజు "ఓర్నాయినో.... దురుమార్గపుకొడుకో" అని పరుగెత్తాడు. జమాస్లు అయిపేలేదు. వార్ని వెంటదగుల్తూ 'తులిసొలస' కదిలింది ఆయుధాల్తో!

కొండమీద నీడల్లాపడిన మేఘాల్ని తూర్పునుండి సూర్యకిరణాలు తరిమేస్తూ కొండల్ని ఎరుపెక్కిస్తున్నాయి.

# ఫిలిప్పైన్ కళాకారులకు బహిరంగలేఖ

ఇమాన్యుయల్ ఎఎఫ్ లకాబా, 1975

నా యవ్వన సహచరులారా!
అనంతంగా ఒకదాని తర్వాతొకటి చరమగీతాలు రాసే
విశృంఖలుడూ, సిగ్గరీ ఐన యువకవి
ఎంత మారాడో తెలుసుకోవాలనుందిగదూ మీకు
మట్టిలా నల్లనైనవాడు
వట్టికాళ్ళవాడు
అతని తలచుట్టూపాగా
పక్కన ఒక వంపుతిరిగినకత్తి
పొడుగాటి తుపాకిగొట్టం నుంచి పెల్లుబికిన అతని బాల్‌పెన్
అన్నిటికంటె లోతుగా అతనిలో రగులుతున్న పరిణామం—
మీరతని గురించి ఇవే వింటారు

కొబ్బరి పొట్టొలిచినట్టుగా
అతను తన కోట్లాదిస్వార్థపు పొరల్ని చీల్చేస్తాడు
లేదా మంటల పాటల కోర్కెను
పౌరాణిక పక్షిలాగా
తన గుండెల్లో బంధించడం నేర్చుకుంటాడు
నిద్రలేక రక్తహీనతకు గురౌతాడు
అతనింకెంత మాత్రమూ సాంఘిక ధర్మాన్నెదిరించడు
అతనింకెంత మాత్రమూ అధోజగత్ సంస్కృతీపరుడుకాడు
అతనిక ప్రజల మనిషి

పదచిత్రాలు మిశ్రమం చేస్తాడుగాని
పర్వతాల లిఖిత, రేఖాగణిత అస్తిత్వాలకు విలువిస్తాడు
అవి అక్కడ ఉన్నాయనికాదు
అక్కడ ప్రజలున్నారని
అక్కడ అతను గుదిగుచ్చాల్సిన బాటలన్నీ
గజిబిజి పజిళ్ళు

పుట్టుకతోనో రాంబో లాంటి కవి అనిపించుకున్న
అతను బందిపోటుకాదు
ప్రజాయోధుడు

మాకు తెగలేదు, తెగలన్నీ మావే
మాకు ఇల్లులేదు, ఇండ్లన్నీ మావే
మాకు పేరులేదు, పేర్లన్నీ మావే
ఫాసిస్టులకు రాత్రిపూట దొంగల్లావచ్చిపడే
గుర్తింపరాని శత్రువులం, మృత్యుదేవతలం
నిరంతరం క్రమిస్తూ, మెరుస్తూ ఉండే తుఫాను రహస్యనేత్రాలం
మా బాట నలగని బాట

అదే మా ప్రత్యేకత
మనమంతా సరిగ్గాసమయానికి
పట్టికాళ్ళ వనాంతర సైన్యంకావాలి
జాగృతులైన ప్రజలే వైతాళికులు
గతించిన మనతరానికి
నిజమైన ఏకైక ఆశ్రియం
కార్మిక కర్షక జనం మధ్యనే

మిత్రులు ఏమన్ అని పిలుచుకునే ఇమాన్యుయల్ 1976 లో ఉత్తర మిండనావ్‌లో సైనికదళాలతో జరిగిన ఘర్షణలో చనిపోయాడు. అప్పటి కతనివయసు 28 సంవత్సరాలు. కాథలిక్ పాఠశాలల శిక్షణలో పెరిగి, మృత్యువుమీదనే ఎప్పుడూ కవిత్వం రాస్తూవుండే ఏమన్ చివరి కొన్నికవితలు జీవితంమీద రాయడంతో ఎంతో మంది అతని మిత్రులు చలించిపోయారు.

# ప్రజ

మూలం ; పాబ్లోనెరూడా The People

స్వేచ్ఛానువాదం : చంద్రిమౌళి

అతడు నాకు బాగాగుర్తు
ఎప్పుడో కొన్ని వేలవేల ఏళ్ళక్రితం చూసానతణ్ని మొదటిసారి
అతడు గుర్రాలెక్కలేదు, బళ్ళు ఎక్కలేదు
పల్లకీలో ఊరేగలేదు
అనంతదూరాలన్నీ మొద్దుబారి చీలిన
తన నగ్నపాదాలపైనే గమించాడు.

అతని చేతుల్లో కత్తులూ, కటార్లూ ఎప్పుడూ చూళ్ళేదు నేను
భుజంపై సుత్తీ, కొడవలి, గొడ్డలి, పార, నాగలి
అతని అస్తిత్వంలో ఓ భాగం
తనవాళ్ళతో ఎప్పుడూ పోట్లాడలేదతను
అతని పోరాటం అంతా నేల, నీళ్ళు, ప్రకృతి, క్రూరకర్కోటకాలతో
ఆకాశాన్నంటే చెట్లనుకూల్చి ఇళ్ళను దూలాల్నీ కిటికీల్నీ అమరుస్తాడు
మట్టితో గోడల్ని, గోడలకు తలుపులు తెరుస్తాడు
సుళ్ళుతిరిగే సముద్రంలోదూకి
రత్నరాశులుతెస్తాడు
మానవకోటికి ప్రాణదానం చేస్తాడు
అతడు నాకు బాగాతెలుసు - అతడు నాలోనేవున్నాడు యింకా

రథాలూ పల్లకీలూ అన్నీ కాలగర్భంలో కలిసాయి
రాజ్యాల దండయాత్రలో ఇళ్ళు, భవంతులూ
దుస్తులూ, నగరాలూ, నగలూ అన్నీ మట్టిపాలయినాయి.
కాని అతడు మాత్రం
ఆ దుమ్ముకింద ఊపిరిపీలుస్తూ, నాకోసం
మిగిలివుంటాడు - సజీవంగా

ఒకప్పుడు అతను తప్ప అన్నీ
శాశ్వతాలనుకున్న ఆ గుర్తులేని వస్తువుల

బూడిద కుప్పల మధ్య....
యుగాల ప్రవాహంలో
వంశాల అనుక్రమణలో
అతడు నా తండ్రో, తమ్ముడో, నా పక్కింటి మనిషో
ఏదో ఒకటి అయ్యుంటాడు
తుఫాన్లో శివమెత్తిన సముద్రం అతణ్ని అతని చిన్నతెప్పనీ
ఆకలిగా ఆబగా మింగేసుంటుంది-
తేనెకోసం వెళ్ళిన అతణ్ని
ఏ సింహమో నమిలేసి త్రేన్చేసి వుంటుంది
మోయలేని బరువులుమోస్తూ కళ్ళుతిరిగి
మెడలువిరిగి కన్నుమూసి వుంటాడు
భూతంలాంటి యంత్రం కోరల్లో చిక్కినలిగి
గుర్తయినా పట్టిలేని శవంలా బయటికి విసిరివేయబడి వుంటాడు
ఆరోజు అతడు యింటికి తిరిగిరాలేదు....

అతడు ఎవరు?
ఇనపముక్కలా కొయ్యదూలంలా
అతనికి వేరే పేరేం వుండదు
బారులు బారులుగా
నడుస్తూపోతున్న చీమల్లో చీమలా
అతనికి వేరే అస్తిత్వం ఏమీలేదు
అందుకే అలసిన అతని కాళ్ళు
ఒక్కసారిగా నిలిచిపోయి అతడు కూలబడి చచ్చిపోతే
ఎవ్వరూ అతణ్ని చూడలేరు
మందల్ని చూడ్డానికి అలవాటుబడ్డ కళ్ళు
అతని ఉనికిని పసికట్టవు
జీవంలేని అతని కాళ్ళ స్థానంలో
యింకో జతకాళ్ళు నిశ్శబ్దంగా వచ్చిచేరతాయి
'మనిషి' మరణిస్తాడు 'మనుషులు' వుంటారు
పనులన్నీ సాఫీగా జరిగిపోతాయి■

అతని స్థానంలో యింకో మనిషి
అచ్చం అతన్లాగే! అలాంటి కాళ్ళే, అవే చేతులూ కళ్ళూ!
అంతా అతడే! అతడు అలాగే మిగిలివున్నాడు
బ్రతుకంతా శ్రమించి, కృషించి రాలిపోయాడనుకున్న
అతను - మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు - అదే రూపంలో
అదుగో ఎక్కడ చూసినా అతనే!
నేలదున్నుతూ—
గుడ్డలునేస్తూ—
నగ్నంగా, ఆకలితో, అలసటతో....
ఎక్కడ చూసినా అతనే
ఈ క్షణం రాలిపోయి, యింకో క్షణం పుట్టుకొస్తూ
అతను మళ్ళీ మళ్ళీ వస్తూనే వుంటాడు
అతని గోరీపై అందమైన నగిషీల స్మారక చిహ్నాలులేవు
అతని సమాధిపై పాలరాతి ఫలకాలు లేవు
చెమటోడ్చి చెక్కిన రాళ్ళపై అతని పేరు వుండదు
అతను ఎప్పుడు వస్తాడో
ఎప్పుడు నిష్క్రమిస్తాడో ఎవ్వరికీ తెలీదు
ఎవ్వరూ చూడకుండా, ఎవరికీ తెలీకుండా
అతనుమాత్రం మళ్ళీ ప్రాణంపోసుకుంటాడు
మళ్ళీ మనమధ్య ఏంజరగనట్లు నుంటుంటాడు

అతనుకూడా మనిషే!
కాని.... అతనికి
ఆస్తుల్లేవు, పొలాల్లేవు, భవంతుల్లేవు
అతన్లాంటివాళ్ళ మహాసముద్రంలో
అతను ఓ బొట్టు-
ఆ బొట్టు సముద్రంలోంచి ఎప్పుడూ పైకి ఎగర్లేదు-
తనవాళ్ళనెప్పుడూ వదల్లేదు-

నగరాలు వెలిసాయి
కొత్తకొత్త మనుషులు వచ్చారు-

రైళ్ళు పరిగెత్తాయి.
విరామమెరుగని అతని శ్రమఫలితం
అందమైనలోకాన్ని నిర్మించింది
నాగరికత పులుముకున్న ఆ వ్యాపారప్రాంతాల్లోకి
వసంతం వచ్చింది, మెల్లగా నడుస్తూ
పావురాల మధ్య హోటల్స్ మధ్య

కాని....
రొట్టెనుచేసిన ఆ చేతుల్ని మరచిపోయారు
ముళ్ళనుఏరీ, రాళ్ళనుకొట్టీ
చెమటా మట్టీ కలిపివేసిన గట్టిరోడ్లపై
అందమైనకార్లలో చెట్లనీ, లోయల్నీ, మబ్బుతునకల్నీ
చూస్తూ వేగంగా వెళతారు.
అతని పాత్ర అంతటితో ముగిసింది.
అన్ని వస్తువుల్లోకి తనప్రాణం నింపి
అతనుమాత్రం యింకోచోటికి వెళ్ళిపోతాడు
తలవంచుకుని ఎవరికీ తెలీకుండా....
ఇంకో ఎడార్ని స్వర్గంగా మలచడానికి
ఇంకో సముద్రాన్ని మళ్ళించడానికి.

చివరికి,
అతని కూలిన బ్రతుకు కుటీరం ముంగిట్లో
మృత్యువు పదధ్వనులు వినిపిస్తాయి.
నిశ్శబ్దంగా తలుపుతెరుచుకొని చావును కౌగిట్లోకి తీసుకుంటాడు
నదిలో దొర్లే రాయిలా అతణ్ని మృత్యువు మోసుకెళ్తుంది

అతడు నాకు బాగాతెలుసు
అలా కొట్టుకుపోతూంటే
ఆ గట్టుమీంచి చూస్తూవున్నాను
ప్రవాహం అతన్ని మింగేసేదాకా
నా వెనుక.

అతడు నిర్మించిన సుందరనగరం - ఇళ్ళు, వాహనాలూ, బాటలూ-
అతడుకట్టిన ఆ ఇళ్ళల్లో అతనెప్పటికీ, ఎప్పటికీ కాలుమోపలేదు
అతడు వేసిన బాటల్లో అతని ఊపిరి నిండివుంది
అతడులేడు- అతనిరక్తం, ఊపిరి, ప్రాణం
నిండిన వస్తువులు వున్నాయి-

నేనువెనక్కితిరిగా అతణ్ని చూడాలని
రోజూ అక్కడ్నే అతనికోసం ఎదురుచూస్తా-
అతని సమాధికోసం వెతికా పిచ్చిగా
అడుగో అతడు తన్ను దాచుకున్న నేల చీల్చుకుంటూ
మట్టిదులుపుకుంటూ లేస్తున్నాడు నా వైపు వస్తున్నాడు
లక్షలాది మట్టిమనుషుల మధ్యనుండి
అతణ్ని నా చేతుల్లోకి తీసుకున్నా
నా గుండె చెరువయింది రక్తం మరుగుతోంది
మానవాళికి సుందర స్వప్నాల్ని సుఖాల్నియిచ్చి
ఎవరికీ తెలీని అడవిలో
ఎండుటాకులా రాలిపోతున్న అతడు
యిలా యింకోసారి ఇతర్లకు
సుఖాల్ని, సంపదల్ని యివ్వటానికి
మళ్ళీ మళ్ళీ పుట్టడంలో అర్థంలేదు!

అతనికోస్వర్గం యివ్వాలి
ఆ స్వర్గంలో మంచిదుస్తుల్లో, పట్టుకుచ్చుల తలపాగాలో
నవ్వుతూవుంటే చూడాలి నేను-
అతడు సృజించిన వస్తువులకు అతడు యజమానికావాలి
అతడు పండించిన గింజలు యిన్నాళ్ళ అతని
మాడిన కడుపులో అమృతంసోనలు కురవాలి!
గనుల లోతుల్లోశ్రమించే వాళ్ళజీవితాల్లో
వెలుగుల వెల్లువలు నిండాలి!
మనిషిని పశువులా గొలుసుల్తో కట్టివేసే
క్రూరవ్యవస్థ పెత్తనం యికపైసాగదు!
స్పందనా జీవంలేని ఈ చీకటి

బ్రతుకులపై ఈ క్షణమే ముట్టడి ప్రకటిద్దాం !
మన జీవితాల్ని శాసించే అధికారాల్నీ
చట్టాల్నీ ఈ క్షణమే నేలమట్టంచేద్దాం

తరతరాల శ్రమలో గట్టిపడి మొద్దుబారిన
ఆ చేతులకి బంగారు తొడుగులువేసి ముద్దుపెట్టుకుంటా !
తూర్పున ఉదయిస్తోన్న ఆ కొత్త సూర్యుడి కాంతి
అందరికీ సమంగా ప్రసరిస్తా!
పెత్తందారీ రాచరికం చరిత్ర పుస్తకంలో
ఆఖరిపేజీ యిప్పుడే రాస్తా

*　　*　　*　　*

అతడు నాకు బాగాతెలుసు- వెళ్ళిన
అతనికోసం సమాధులన్నీ వెతికా పిచ్చిగా
ఇంకా తెరుచుకున్న ఆ కళ్ళకోసం. ఇంకా వినిపించే ఆ గొంతుకోసం

ఇంకా దుమ్ముపట్టని ఆ చేతుల్ని
నా గుండెలకదుముకుంటూ అతనితో
మెల్లగా మాట్లాడా వణికే గొంతుతో

'లోకంలో అన్నీ మట్టిలో కలుస్తాయి
కాని నువ్వుమాత్రం సజీవంగా వుంటావు
నీకు మాత్రం చావులేదు'

జీవితాల్ని వెలిగించావు నువ్వు !
ప్రపంచాన్ని నిర్మించావు నువ్వు !
ఇదంతా నీదే, నీ స్వంతం

నేనీరోజు ఒంటరివాణ్ని కాను
అందరి గుండెల్తో కలిసి
నా గుండె స్పందిస్తోంది
అందరి గొంతుల్తో కలిసి
నా గొంతు పాడుతోంది
నా మాటలెవరో వింటున్నారు, వాళ్ళకు తెలీకున్నా
నా పాటలోని వాళ్ళ 'ఆ మనుషులు'
పుట్టుకొస్తుంటారు-ప్రపంచాన్ని జీవంతో నింపుతారు.

# గిరిజన సాహిత్యం - ఒక పరిశీలన

సాహు

ఆదిలాబాద్ గిరిజనులకు జీవితం ఎంతముఖ్యమైందో ఆట-పాటకూడాఅంతే ముఖ్యమైనవి.... మైదానప్రాంతాలల్లో వర్గసమాజం కాలూని నిలదొక్కుకోవడం తోటే ఆట-పాట వాళ్ళరెక్కల్లి బొక్కల్లనుండి కొంతదూరం జరిగేప్రియత్నం చేసి నట్లు కన్పిస్తుంది.... అట్లా ప్రజలు శ్రమచేస్తూ పాడేపాటలుతప్ప- సామూహిక నృత్యాలు, పంటగలకు, పబ్బాలకు, పెళ్ళిళ్లకుచేసే నృత్యగానాలు ప్రజల్లో క్రమంగా అంతరించిపోయి వాటిస్థానే అలాంటి కార్యక్రమాలు నిర్వహించడానికి ప్రత్యేక మయిన బృందాలు ఏర్పడ్డాయి. అట్లా ప్రతికులానికి ఒకసాంస్కృతిక బృందం ఏర్పడింది.... ఉదా॥ గోత్రాలవాళ్ళు, చిందోళ్ళు వగైరా.... రానురాను కళకూడా 'పెట్టుబడి'గా మారినదశలో సినిమాలువచ్చాయి.... ఈ సినిమా సంస్కృతితో ఈ బృందాల మనుగడకూడా కష్టమైపోయింది....

గిరిజన ప్రాంతాలల్లోకి అనేకకారణాల మూలకంగా ఈ మారిన సంస్కృతుల ప్రభావం కొంతఆలశ్యంగా ప్రవేశించుట మూలకంగా ఆట-పాట ఇంకావాళ్ళను విడిచిపెళ్ళలేదు.... అయితే ప్రభావం అంతోఇంతో ఉన్నది కనుకనే గిరిజనులల్లో సాంస్కృతిక వ్యవహారాలు చూడడానికి 'పరధాన్లు' ఏర్పడ్డారు.... దేవరలను కొలిచే టప్పుడు తదితర కొన్ని ముఖ్యకార్యక్రమాల్లో పరధాన్లు సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించిన అఖాడి డివాడి పండుగలల్లో వెన్నెలరాత్రిలల్లో డెమ్సా, గుసాడి, గమేలా, స్త్రీపురుషులు ఎదురెదురుగా చేసేనృత్యాలు అనేకసందర్భాలల్లో ఇంకాప్రజలు చేస్తూనేఉన్నారు.

మైదానప్రాంతాలల్లోని "జానపద సాహిత్యం"లాగే గిరిజన సాహిత్యానికి లక్షణంలేదు.... జీవితంలో వాళ్ళుపొందిన వైఫల్యాలు, లేదా దుర్భరజీవితంకు ఏదన్న పరిష్కారం చూయించమని దేవరేలను ప్రార్థించడం- ప్రయాణం వగైరా వీళ్ళఆట - పాటలో ప్రతిఫలిస్తుందేవి.

ఉదా॥

పెరుస పేండుస్కి వాజారివాయో / పెద్దదేవునికి దయఎందుకు లేకపాయె.

దునియతేరంగ్ వైట్ మాంతా / దునియంత చెడిపోతున్నది.

ఈ పాటలో తనచుట్టుఉన్న ప్రపంచమంతా చెడిపోతున్నట్లుగా దేవునితో మొర పెట్టుకుంటారు. కాని ఏకారణాలచేత ప్రపంచం చెడిపోయింది? దానికి

పరిష్కారమేమిటి! ఎవరు ఈ ప్రపంచాన్ని చెడగొడుతున్నారు? మరి దానికి దేవుడు ఏమన్నా చేయగలడా? ఇలాంటి విషయాలపట్ల స్పష్టమైన ఆలోచనలేదు. దగాపడిన తమ్ముల ఆవేదనతప్ప....

గిరిజనుల సామూహిక నృత్యానికి, అద్భుత జానపద కల్పనకు గమేలా నృత్యముతారార్కాణము....

కోకో / (మరిది) తరాయాంగే దాండే / తీసుకరా వదినే తుపాకీ
మల్ పాయ్ లేదాకా / నెమలిని కొట్టడానికిపోత.
అంగే / (వదినె) పాయిమ కోకోపాయిమా / కొట్టకు కొట్టకుమా
మల్ మెస్కాన్ వాతా / నెమలి గుడ్లకొచ్చింది.

ఇట్లా గూడెంలోని వాళ్ళంతా గమేలా (బుర్రలాగ ఉండే సాధనం)తో పాడుతూ ఉంటే అందులో నాట్యము చేయగలిగినవాళ్ళు వలయాకారంలో తిరుగుతూ నృత్యంచేస్తుంటారు మరిది తుపాకితో నెమలిని కొడుతానంటాడు. వదినె నెమలి గుడ్లుపెట్టి పొదిగి పిల్లలు చేస్తుందంటుంది. నెమలి పిల్లలు పొదిగినట్లుగా నృత్యం చేసేవాళ్ళు తమ నృత్యంతో సూచిస్తారు. అప్పుడు ఒక్కొక్క పెద్దవాడు ఒక్కొక్క చిన్నపిల్లవాడిని గద్దలాగ అభినయిస్తూ ఎత్తుకపోతాడు. నెమలిపిల్లలను అన్నింటిని గద్దతన్నుకపోతుంది. నెమలి ఒంటరిగా మిగులుతుంది. మరిది "అన్ని పిల్లలను గద్దలుఎత్తుకపోయే నేను అప్పుడే నెమలిని తుపాకితో కొడుతానంటే వినకపోతివి" అంటాడు. నృత్యం ముగుస్తుంది....

ఈ నృత్యంలో సహజంగా అడివిలోబతికే గిరిజనులు తమచుట్టుఉన్న జంతువులను జీవవ్యాపారంకోసం వేటాడాలనే ఆలోచన కన్పిస్తుంది. వదినె మాటల్లో దాన్నొక దాన్ని చంపడంకాదు దాన్ని పెంచిపోషిస్తే పిల్లలపెడుతుంది అనే మైదాన ప్రాంతపు పశుపోషణకు సంబంధించిన భావజాలం కన్పిస్తుంది. కాని అడివిలో బతుకు అందుకు అనుమతించదని నృత్యం ముగుస్తుంది....

అయితే ఎక్కడైతే అంతవరకు ఆచరణలోఉన్న జీవితం ప్రతిబంధకంగా తయారవుతుందో అక్కడే అలాంటి జీవితాన్ని ప్రతిఘటించడం, పెనుగులాడటం ప్రారంభమౌతుంది.... గిరిజనుల ప్రధానవృత్తి వ్యవసాయంగా మారిన దశలో- వాళ్ళకు భూమి కావల్సివచ్చింది. భూమికోసం అడివితో హోరాహోరి పోరాడారు. అప్పుడు 'పెన్కా'ను వేడుకోవడం స్థానే మానవశక్తిని కీర్తించే సాహిత్యం వాళ్ళ

ఆటపాటల్లో చోటుచేసుకున్నాయి. అడివితో యుద్ధంచేసి కీకారణ్యముల నరికి. భూమిని తలకిందు చేశారు.... గిరిజనులు అడవిమీద గెలిచారు భూములుగెలుచుకున్నారు.... సరిగ్గా అలాంటి సమయంలోనే. మైదానప్రాంతాల దోపిడిదార్లకు అప్పుడప్పుడు వచ్చిపోయి, అప్పుడప్పుడు అడవిసంపదలు దోపిడిచేయడంస్థానే గిరిజనుల భూములమీద కన్నుబడ్డది మాయోపాయాలతో వాళ్లభూములను ఆక్రమించుకోవడం ప్రారంభించారు.... గిరిజనుల బతుకు దుర్భరమయ్యింది.... మళ్లీ భూమికోసం యుద్ధం చేయడం ప్రారంభమైంది.... ఈ యుద్ధం సంఘటితరూపం తీసుకున్నది. ఆదిలాబాద్ ప్రాంతంలోనైతే కొమురం భీము కాలంలోనే కొమురం భీం జోడెన్ ఘాట్ కేంద్రంగా నైజామ్ సర్కారుకు వ్యతిరేకంగా సాయుధంగా తిరుగుబాటు చేశాడు. అప్పుడు తాము కోరుతున్న రాజ్యం, బతుకుఎట్లుంటాయోగోండు ప్రజానీకానికి తెలియజేయడానికి "గొంగడోల్లు" (గొంగడి కప్పుకొని చంకకుతుపాకివేసుకొని గూడెంలో పాటలు పాడేవాళ్ళు) అనే సాంస్కృతికదళం ఏర్పాటు చేశారు. అవి గూడెం గూడెం తిరిగి ప్రచారం చేశాయి....

జైబోలోరే జైబోలో
కొమురంభీముకోయదాదాకు

(ఈపాట పూర్తిగాకావలసినవాళ్లు 'కొమురంభీం' నవలలోగాని అరుణతారలో లోగడ ప్రచురించిందిగాని చూడవచ్చు)

కొమురంభీం నైజాము తుపాకిగూటాలకు బలైపోయాడు.... ఆతరువాత మళ్లీ గిరిజనులు చెల్లాచెదరైపోయారు.

మళ్ళీ 1977 నుండి పౌరకలసార్లు గిరిజన గూడాలల్లోనికి వెళ్లారు. గోండు, కొలామ్ తదితరగిరిజన సంస్కృతితో అట్లా విప్లవపోరాటం భూమికోసం ఉధృతమైంది.... వేలాది ఎకరాలభూమి గిరిజనులు పోరాడి సాధించుకున్నారు. ఈపోరాటం కొత్తసంస్కృతిని ఇంతకుముందు ప్రచారంలోఉన్న జానపదసాహిత్యం స్థానే ప్రజాసాహిత్యాన్ని ప్రవేశపెట్టింది.

ఈ ప్రజాసంస్కృతిలోని భాగంగా ఆదిలాబాద్ గిరిజనులు ఏలాంటి ఆట-పాటలు ఆడుతున్నారో పాడుతున్నారో కొన్నింటిని ఈ వ్యాసంలో చెప్పాలనే ప్రయత్నం....

పెళ్ళిళ్లు, చావుపుట్టుకలు, వేడుకలు, పండుగలు పబ్బాలల్లో ఇదివరకటి లక్షణం లేని సాహిత్యంస్థానే "పోరాటం" చోటుచేసుకుంటున్నది. ఇప్పుడు ఆదిలాబాద్ గిరిజనులు తమ గతజీవితాన్ని తవ్విపోసుకుంటారు. పరాయిప్రభువుల పాలనకిందికి రావడం- వాళ్లతోపోరాటం ఆ పిదప నైజాంవ్యతిరేకపోరాటంలో భూమికోసం అసువులు బాసిన మృతవీరుల సంస్మరణ పాటలు - అన్ని వాళ్ల వాళ్ల గుండెలోతుల్లోంచి పెకిలిస్తున్నారు ఇంకోమాటలో చెప్పాలంటే ఆదిలాబాద్ గిరిజనులు తమకాళ్ళకింద భూమిని తామే పరిశీలించి చూస్తున్నారు.... గతాన్ని ఈనాటి పోరాటంవెలుగులో సమీక్షించుకుంటున్నారు. ఈ చైతన్యాన్ని గిరిజనుల్లోకి తీసుకవెళ్లింది పొరకలసార్లే-

ప్రజాజీవితమనే గనినుంచి తవ్వకాన్ని ప్రారంభించినప్పుడు మట్టి, బంగారం బయటికొస్తున్నాయి, మట్టినివేరుచేసి బంగారాన్ని వాళ్ళజీవిత వాస్తవికతతో పుటం పెట్టినప్పుడు ఎట్ల ఆనందిస్తారో ఆవేశపడతారో- పాటే ఈ చేలాగా, వడిసెలరాయి వినిపించే సంగీతంలా ఇంకా ఇట్లాగే శ్రమలోపాల్గొన్నప్పుడు శరీరం పరికరాలుపడే ఆవేదనా సంఘర్షణలు ఎట్లా దర్వులుగా ఉంటాయో పొరకలసార్లు పాడుతుంటే అట్లా లీనమవుతారు. అయితే పోరాటగీతాలను వాళ్ళభాషలో పాడేటప్పుడు వాళ్ళబాణీ, ఉచ్చారణ, తదితరవిషయాలల్లో ఎంతో సంఘర్షణపడి ఇప్పుడిప్పుడే వాళ్ళబాణీలను, పాటలను బయటకుతీసి మెరుగుపరచి మళ్ళీ వాళ్ళకందించేప్రయత్నం కన్పిస్తుంది....

ఉదా॥ జెగ్గులాగాఉండే పెద్దపరికరం వంతవాయిస్తుఉంటే వాయిలిన్ మాదిరిగా ఉండే పరికరం కథకుడు వాయిస్తూ పరధాన్లు ఇద్దరే చెప్పేకథ....

కథకుడు॥ సిరిమూట్ సిరిమూట్ / చుట్టుముట్టు చుట్టుముట్టు
సిరిమూట్ తిరిపి / చుట్టుముట్టు తిరిగి

వంత॥ సిరిమూట్ తిరిపి / చుట్టుముట్టు తిరిగి

కథకుడు॥ గంగమ్మ పొంగంతారా / గంగమ్మ పారుతుందిరా
హేడంగాలిక్ గుట్టాంగ్ / ఓహో పొడవైన గుట్టలూ

వంత॥ హూంతారోయ్ / ఉన్నాయోయ్-

కథకుడు॥ పేకువనం మస్తుమంత / పేకువనం మస్తుగున్నది
వెదురువనం మస్తుమంత / వెదురువనం మస్తుగున్నది

వంత॥ వండేబత్తాల్ మంతా? / ఇంకేమున్నదీ?

కథకుడు॥ పొడుదు దిస్వకనే / సూర్యుడు కనబడని
కేడమంతరా / అడవున్నదిరా !

వంత॥ కెడతాకోయ రాజుల్ / అడవిలో కోయరాజులు
బహాన్ మంతేరో / ఎట్లున్నరోయ్ !

కథకుడు॥ కోయరాజులో / కోయరాజులు
రాజల్ కోయతురో / రాజులు కోయలు
బహాన్‌మంతేరిత్తకే / ఎట్లున్నరంటే
సోకుసమంతేరు / దర్పంగా ఉన్నారు.

ఈ పాటలో గిరిజనులు తమ చుట్టుముట్టు ప్రకృతిని ఆప్రకృతిలో జీవించేవాళ్ళ దర్పాన్ని కీర్తించారు.... ఇంకా ఢిల్లీపాదుషా ఎట్లా ఉండేవాడు అతని కోటలు-రాణులు, సల్లాపాలు, సౌఖ్యం అన్నీవర్ణించి- వాళ్ళ పైనవర్ణించిన అడివిలోని గోండురాజ్యాన్ని ఆక్రమించుకున్నప్పుడు- గోండురాజులు ఎట్లా పోరాడారో ఎట్లా వాళ్ళగోండురాజ్యం పతనమైందో పరధాన్లుచెప్పే కథలో స్పష్టంగా మనకు కన్పిస్తుంది.

ఈ పాటలోని మూలవిషయం పొరకలసార్లు గ్రహించి ఇంద్రవెల్లి విషాద ఘటన జరిగిన తరువాత గిరిజనుల పోరాటాన్ని ప్రతిబింబించే రగల్‌ఝుండా ఒగ్గుకథలో

జిల్లాలో జిల్లుందిరో ఓరినాయనో
ఆదిలాబాద్ జిల్లుందిరో ఓరినాయనో
చుట్టుముట్టు అడవులున్నయా ఓరినాయనో
పొడవైన గుట్టలన్నయిరా ఓరినాయనో
.... .... .... .... .... .... ....
గంగమ్మ పారుతుందిరా ఓరినాయనో

(గోండు భాషలోకూడా ఈ గిరిజన గూడాలలో వందలసార్లు చెప్పబడ్డది)

ఈవిధంగా పరధాన్లు చెప్పినకథ విప్లవీకరించబడి మళ్లీ ప్రజల్లోకి తీసుకపోబడింది, ప్రజలు ఈ కథను తిరిగి గానంచేస్తున్నారు, గూడాలల్లో ఈ కథలోని పాటలు ఇప్పుడు మనకు తరచూ వినిపిస్తుంటాయి.

గిరిజనులు పొరకలసార్ల అడుగు కదలికను గమనించారు, సుడుగులోని పొగసులను గుండెకద్దుకున్నారు. భావాన్నిగ్రహించారు....

వీరులారా మీకు ఎర్రెర్రిదండాలు
మీ పాదా పాదాన ఎర్రెర్రిదండాలు

ఈ పాటను గూడాల్లోకి పౌరకళసార్లు తీసుకపోయినప్పుడు- ఈ బాణీ వాళ్ళ బాషకు పొసగలేదు- బాణీ అందలేదు. కాని భావంవాళ్ళను కదిలించింది అలాంటి అమరవీరులను వాళ్ళ వాళ్ళ బతుకుపోరాటంలో ఎరుగుదురు.... అదేభావాన్ని తీసుకొని

"జై బోలోరే కొమురం భీం
కోయదాదాకు
జై బోలో
జై - జై - జై - జై బోలో

అనే వాళ్ళ పాతబాణీలో భూమికోసం, విముక్తికోసం ఈనేల నాలుగు చెరగులా తాము రక్తపుధారలుపోసి పోరాడిన అమరవీరులను స్మరిస్తూ....

జై బోలోరే జై బోలో
జై-జై - జై బోలో-

బాబఝురినగ / బాబెఝురిలో
నైజాంతోడో / నైజాంతో
బందూక్ తాక్‌తోర్ / బందూకెత్తిన
కొమురం భీంకు / కొమురం భీంకు
అద్ లడాయినసాతోర్ / ఆ యుద్ధంలో
దాదలీర్ కున్ / ఒరిగిన అన్నలందరికీ
జై బోలోరే జై బోలో
కొమురం భీంకు జై బోలో
చాకటి బాదుకు జై బోలో
కొమురం రఘుకు జై బోలో "జై"

కరీంనగర్ ఆదిలాబాద్‌నగ / కరీంనగర్ ఆదిలాబాద్‌లోన
తడిమిధాతన పొత్సిపొత్సి / నిప్పువోలె మండి మండి
రైతుభూతితుర రాజ్యంసాటి / రైతుకూలీ రాజ్యంకోసం

పారన్ సీతేర్ / పాణాలిచ్చిన
దాదలీర్ కున్ / అన్నలందరికీ

జైబోలోరే జైబోలో
గంగరాంకు జైబోలో
గంగరాజుకు జైబోలో ॥జై॥

(ఈ పాటను పౌరకలసార్లు మరింత పదును పెట్టి రగల్ ఝండా ఒగ్గుకథలో పాడుకున్నారు) ఈ పాటలో గిరిజనులు పౌరకలసార్లు తెచ్చిన కొత్తభావాలను గానం చేయడం కనిపిస్తుంది.

అయితే పౌరకలసార్లు పరివేశపెట్టిన పోరాటసంస్కృతి, సంస్కృతిని పరివేశ పెట్టింది.

సర్పంచానార్ నాటేన్ కే / సర్పంచీ ఊరూర
నీవాపోరోల్ హేతుకీకోం / నీపేరు యాదిజెయ్యాలే
అహా ! సర్పంచా ! అహా ! సర్పంచా

ఉట్నూరే సొత్తి - ఉట్నూరుపోయి
కారువాయి కిత్తి - కార్వాయి చేసి
పోటితత్తనిత్తి - జొన్నలబస్త తెత్తనంటివి
ఉదార్ ఇత్తి - ఉద్దెరఅంటివి
నగదేఎత్తి ॥సర్పంచా॥ - నగదు తీసుకొంటివి

ఎదులబాదుసొత్తి - అదిలాబాదుపోయి
కార్వాయికిత్తి - కార్వాయిచేసి
కుయితత్తసిత్తి - బావితెప్తనంటివి
కుయికీతసిల్వా - బాయితవ్వకపోతివి
పెట్టినిండతిత్తి ॥అహాసర్పంచా॥ - కడుపునిండతింటివి

జూన్‌గామేసొత్తి - జనుగామపోయి
కార్వాయికిత్తి - కార్వాయిచేసి
కొందతత్తనిత్తి - ఎడ్లతెత్తనంటివి
డెమ్మకయితెత్తి ॥అహాసర్పంచా॥ - ఏడంచెయ్యిచూపితివి

ICDS (International Child Development Society)

అట్లాగే అంగన్‌వాడి (గిరిజనుల సంక్షేమంకోసం ఏర్పర్చబడ్డ ఉద్యోగులు) అంగన్‌వాడి ఉద్యోగులు గిరిజనులకు పుస్తకాలు, శుభ్రితగురించి నాగరికతగురించి

చెప్పుతారు, ఆహారపదార్థాలు అప్పుడప్పుడు తెచ్చిపెడతారు. కాని పైఅధికార్లే సగం స్వాహాచేస్తుంటారు. కాని గిరిజనులకు ఎదురుగా కనపడేది ఈ అంగన్ వాడి ఉద్యోగుల దిగమింగడమే.

మావానాఁటేనే వాతా / మావూరికొచ్చింది
అంగన్ వాడి / అంగన్‌వాడి
పాండారే గోలుపాడి / కట్టింది గుడర్పింగచీర

చుడ్డుడగ్గురుకు సురికేసి / చిన్నపెద్దలనుకూడేసి
పుస్తక్‌తార్లేన్ పోరోలిహికేసి / పుస్తకాలుతెస్తనని పేర్లెమె రాసుకొని
చుడ్డుడగ్గురుకు బూడికీతి / చిన్నపెద్దోల్లను ముంచివేసింది
తానేపెట్టినిండ తింజిసొత్తా "మావా" - తానే కడుపునిండ తిన్నది.
కాండీర్ తిన్నేన్‌బత్తలోతచి / పొలగాల్లకోసం ఏదోతెచ్చి
కాండీర్ తోడ్డిత తోడిన్‌వాడ్సి / పొల్లగాల్లనోట్లో మట్టేగొట్టి
ప్లేటుకు మూటుకు సొప్పతున్ వోమ్సి / ప్లేట్లు గీట్లు అన్నిఅమ్ముకొని
అంగన్‌వాడి ఆగమేకీతరోయ్ "మావా" అంగన్‌వాడి ఆగంచేసింది.

ఇట్లా తమపాంతాలల్లోకి ప్రభుత్వం తెచ్చిన కొత్తఅధికార్లను లేదా వాళ్ళలోని వాళ్ళనేమార్చిన విధానాన్ని ప్రశ్నించడం కనిపిస్తుంది. ఇట్ల ప్రశ్నించడంతోటే ఆగిపోలేదు గిరిజనులు.

భూమికోసం భుక్తికోసం అంతిమంగా విముక్తికోసం పోరాటంచేసే పోరకల సార్లను తమగూడాల్లోనికి ఆహ్వానించి గుండెల్లో నింపుకున్నారు.

తుడుంకొట్టారు.... కొమ్ముమూదారు, యుద్ధరంగంలో జెండేతోనిలుచున్నారు. రగల్‌ఝండానెత్తిపట్టారు. ఈ పోరాటక్రమంలో అమరులైనవీరులు తమ ఆట-పాటల్లో చోటుచేసుకున్నారు.... గతంలో ఈ గోండుగూడేలల్లో మ్రోగిన అనేక పాటలను క్రాంతిప్రచురణలుగా పుస్తకరూపంలో వచ్చాయి.

ఒక ప్రమాదంలో అమరుడైన రవి గురించి గిరిజనులు పాడుకుంటున్న పాట- ఈ పాటకట్టింది అక్షరజ్ఞానంలేని ఒక గిరిజన కామ్రేడు లకేరావు....

ప్రజాసాటి పెసితినిమ్మె / ప్రజలకొరకు ఉదయించినావు
పాృజాత్ సాటిబాందేపీయిత్తి / ప్రజలకొరకు తుపాకి ఎత్తిపట్టినవ్
తేదాతేదా నిమ్మేరా ఓరవిదాదా / లేలేరా నువ్వు ఓ రవన్నా
తేదాతేదా నిమ్మేరా ఓరవిదాదా / లేలేరా నువ్వు ఓ రవన్నా
కడెంనా నాటే జన్మనీవా / కడెంఊర్లె జన్మించినావు
పెరునసాదు కరిపిత్తి నిమ్మే ॥తేదా॥ / పెద్దచదువు చదివినావు
పార్టితాగమేరామాసి / పార్టీలో కలిసి
ఓందికాయిదే జండపియిత్తి / ఒకచేత్తో జండపట్టి
ఓందికాయితే బాందేపియిత్తి ॥తే॥ / ఒకచేత్తో తుపాకి పట్టావు
గుట్టాంగ్ మెట్టాంగ్ విలిత్తి నిమ్మె / గుట్టలు మెట్టలు తిరిగావు నువ్వు
సాటిసిల్కాన ఏరేఉటి ॥తే॥ / ఒర్రెల్ల ఒంకల్ల నీల్లుత్రాగావు
గుడాంగ్ కీడాంగ్ వెలిత్తి నిమ్మె / గూడాల్లో అడవుల్లల్లో తిరిగావు
బాయిదాదానీ వడ్కీకీతే / అక్కల అన్నల గుర్తెరిగినావు
నీవాపాటా కెంజ నామన్మట్ / నీ పాటవినాలే మేము
నీవాఎందువల్ సూడానా ॥తే॥ / నీఆట చూడాలే మేము
పిట్టేపురాడ్ హేతుకీంతా / పిట్టలు, పూరెళ్లు జ్ఞాపకంచేస్తున్నాయి
మందెజదెమంతా ఓరవిదాదా ॥తే॥ / మనసులో బాధతో ఉన్నాము
నిమ్మతాక్తా పరిత్రాకకొం - నీవు నడిచినబాట నడుస్తాం
నిమ్మెపియిత్తి బాందేపిక్కోం ॥తే॥ / నీవు పట్టిన తుపాకి పడుతాం
నిమ్మవెహత్తా గొష్టిమమ్మట్ / నీవు చెప్పిన మాట మేము
ఒంటిట్ కో మరొంగోమ్ ॥ఓరవి॥ / ఎన్నటికైనా మరవబోము
గారీబుసాటి పారణ్ సీతీ / గరీబులకోసం ప్రాణమిచ్చావు
గరీబునఘల్ రాంరాం హేతాదాద్దా ॥తేదా॥ / గరీబోల్ల లాల్ సలామ్‌లు
అందుకో అన్న

ఇట్లా ఇవ్వాళ్ల జానపద సాహిత్యం ప్రజాసాహిత్యంగా రూపుదిద్దుకుంటోంది. ఈ క్రమంలో పదేఘర్షణ ఎట్లాఉంటుందనే విషయం తెలిపే ప్రయత్నమే ఈవ్యాసం.

అక్టోబర్ 28 కొ. కు. పుట్టినరోజు :

# సామాజిక వ్యాఖ్యాత కొడవటిగంటి కుటుంబరావు

కె. బాలగోపాల్

హైదరాబాద్‌లో నాంపల్లి స్టేషన్‌రోడ్డులో 'హరేకృష్ణ' భజనసంఘం కార్యాలయం వుంది. ఆ రోడ్డుమీద పోతూవుంటే ఆ సంఘంసభ్యులు తరచుగా భజనచేస్తూ తారసపడతారు. అందరూ చూడడానికి ఒకేలాగుంటారు. అందరి వేషధారణా ఒకేలాగుంటుంది. అందరిపలుకూ ఒకేలాగుంటుంది. అందరి ఆలోచనలూగూడ బహుశా ఒకేలాగుంటాయేమో. ఉంటే అది మనుష్యులకు అస్వాభావికమేగాని భజనభక్తులలో అసాధారణంకాదు. ఒక 'గురువు' పాదాలచెంత తమవ్యక్తిత్వాల్ని అర్పణచేసి తాము ఊహించుకున్న 'భగవంతుడి'తో తాదాత్మ్యం చెందడం అనిపిలవబడే అఖండ ఉన్మత్తస్థితిని పొందడం భజనసంఘాల లక్ష్యం. ఆ అఖండస్థితిలో వ్యక్తిత్వాలకు రంగూరుచీవాసనా ఉండవు. ఉండకపోవడమే వాళ్ళకుకావాలి. అటువంటి స్థితిలో ఆలోచనఅంటూవుంటే అది అందరిలోనూ ఒకేలాఉండడంలో ఆశ్చర్యం లేదు.

కమ్యూనిజంగూడ మనుషుల్ని రంగూ రుచీవాసనాలేని మూసమనుషులుగా మారుస్తుందనే బూర్జువాదూషణ ప్రచారంలోవుంది. అది అబద్ధంకావడానికి ఒకటే కారణం. ప్రజాఉద్యమాల లక్ష్యం నిర్గుణమయిన తాదాత్మ్యస్థితిని సాధించడంకాదు, ఈ భౌతికప్రపంచాన్ని ఇప్పుడున్నదానికంటే అందంగా తీర్చిదిద్దడం. అట్లా తీర్చిదిద్దడంలో ప్రపంచానికి సహజమయిన వైవిధ్యంనశించదు. అందులోని చెడు రాలిపోతుందిగాని మంచి మరింత రాణిస్తుంది. ప్రజలజీవితంలో ఎంతవైవిధ్యంవుందో ప్రజారాజ్యంలో అంతఉంటుంది, ప్రజాఉద్యమంలోనూ అంతఉంటుంది. ప్రజాఉద్యమంలోకి వచ్చేవాళ్ళ వ్యక్తిత్వాలు ఉద్యమంలో కరిగిపోవు. ఉద్యమం వాళ్ళవ్యక్తిత్వంలో కరిగిపోతుంది. తమపూర్వవ్యక్తిత్వాలను ఉద్యమ వ్యక్తిత్వాలుగా ఒక్కొక్కరూ ఒక్కొక్కవిధంగా మలచుకుంటారు. విప్లవోద్యమంలో భాగంగా ఒక రచయితనయినా ఇతర రంగాలలో పనిచేసే కార్యకర్తనయినా అర్థంచేసుకునేటప్పుడు ఈ అవగాహనతో ప్రారంభించడం ప్రథమం.

మార్క్సిస్టు రచయితగా కొడవటిగంటి కుటుంబరావుకు ఒక స్వతంత్రమయిన తాత్విక వ్యక్తిత్వంవుంది. ఇక్కడ 'స్వతంత్రం' అంటే సిద్ధాంతానికీ ఉద్యమానికీ

అతీతమయినదని కాదు, తన స్వంతముద్రగల సమగ్రమయిన తాత్వికవ్యక్తిత్వం వుందని. ఇది కుటుంబరావు ప్రత్యేకతే, ఎందుచేతనంటే మార్క్సిస్టు రచయితలకు సాధారణంగా తమదయిన సాహిత్యవ్యక్తిత్వం ఉంటుందిగాని తాత్వికవ్యక్తిత్వం ఉండదు. తాత్విక విషయాలలో అభిప్రాయాలు మాత్రమే ఉంటాయి. ఆ అభిప్రాయాలు మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలనుండి గ్రహించినవి కావచ్చు, వాటి విపులీకరణలు గూడకావచ్చు, కాని పలికే ప్రతీవాక్యంలోనూ ప్రతిఫలించేటటువంటి విస్తృతి మాత్రమే కాక పుష్టిగూడ కలిగిన తాత్విక దృక్పథం ఉండడం అరుదు. అందుకే సాధారణంగా మార్క్సిస్టు రచయితలు గతితార్కిక భౌతికవాదం గురించో ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితి గురించో రాయమంటే దీర్ఘమయిన వ్యాసాలు రాయగలరుగాని చెట్టుమీదా పుట్టమీదా రాయమంటే రాయలేరు. అథవారాసినా, ఆ పూటకు మార్క్సిజం పక్కకుపెట్టి తమ పూర్వాశ్రమ 'సంస్కార'మయిన మధ్యతరగతి మర్యాదస్తుల దృక్పథంతో రాస్తారు. ఒక్కొకసారి చాలా రియాక్షనరీగా రాస్తారుగూడ. కాని కుటుంబరావు మాత్రం కుటుంబరావుగానే లెనినిజం నుండి సినిమా పాటల వరకు అన్నిటిగురించీ రాసాడు. దేనిగురించిరాసినా మనకు కుటుంబరావు గొంతే వినిపిస్తుందిగాని మార్క్సిజం గొంతు ప్రత్యక్షంగా వినిపించదు. అంతా చదివిన తరువాత, ఆ ఆసక్తిగాని మనకు ఉంటే, ఇది మార్క్సిజమేనా అన్న మీమాంస మనకే మిగులుతుంది. ఒక్కొకసారి ఆ ప్రశ్నార్థకం ప్రశ్నార్థకంగానే మిగులుతుంది గూడ.

కుటుంబరావు 20వ శతాబ్దపు ప్రథమభాగంలో కోస్తా ఆంధ్రప్రాంతంలోని పట్టణాలని పిలవబడే బలిసిన పల్లెటూళ్ళలో ఒకదానిలో పుట్టాడని, మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో పెరిగాడని, తెలియకపోతే మనకు కుటుంబరావు అర్థంకాడు. ఆయన ఆలోచనలను మార్క్సిజం శోధనచేసిన తరువాత గూడ ప్రతిక్షేపంగా మిగిలిపోయి ఆయన తాత్వికవ్యక్తిత్వంలో రంగరించుకుపోయిన ఈ పూర్వాశ్రమపు అంశాలు కొన్ని ఉన్నాయి. బహుశా అవేలేకుంటే అభ్యుదయ భావాల్ని బూర్జువా వారమాసపత్రికల పాఠకుల దగ్గరికి తీసుకుపోవడంలో ఆయన సాధించిన విజయం సాధ్యమయ్యేది కాదేమో. 'యువ'లోను 'ఆంధ్రజ్యోతి'లోను 1970 తరువాత ఆయన రాసిన వ్యాసాలుచూస్తే ఈ విషయం అర్థంఅవుతుంది. మార్క్సిజం అంటే బహుశా ఇష్టంలేని వాళ్ళదగ్గరికీ, 'బూర్జువా' 'దోపిడీ' వగైరా పదజాలాన్ని విని దడుసుకునే వాళ్ళదగ్గరికీ, శాస్త్రీయసోషలిస్టు భావాలను చేర్చడానికి ఆయన చేసిన

ప్రయత్నం ఈ వ్యాసాలన్న సంగతి మనం మరచిపోకూడదు. మరిచిపోయి ఈ వ్యాసాలను విశ్లేషిస్తే ఆయనకు అన్యాయం చేసిన వాళ్లమవుతాము. ఆప్రయత్నంలో ఆయన అనుసరించినశైలి పరీక్షించదగ్గది. అనుసరించదగ్గదో కాదో నాకు తెలీదు. మార్క్సిస్టు పారిభాషికపదాలనూ సిద్ధాంతాలనూ కొటేషన్లనూ వీలయినంతతక్కువగా ప్రయోగించి మార్క్సిజాన్ని వివరించే ప్రయత్నం కొన్ని సందర్భాలలో తప్పకుండ కాంక్షనీయం. రష్యాలో జార్‌ప్రభుత్వం సెన్సార్‌కళ్లు కప్పడానికి ప్లెఖనోవ్ 'materialist' అనేబదులు 'monist' అనే పేరుపెట్టి మార్క్సిస్టు చారిత్రిక భౌతిక వాదంమీద పుస్తకం రాసాడు. లెనిన్‌గూడ సామ్రాజ్యవాదంమీద తన ప్రామాణిక మయిన వ్యాసం రాసేటప్పుడు రష్యన్ ప్రభుత్వ సామ్రాజ్యవాద చర్యల గురించి మాత్రం చెప్పకుండ జాగ్రత్తపడవలసి వచ్చింది. అయితే ఈ ప్రభుత్వ సెన్సార్ లేకున్నా మధ్యతరగతి పాఠకుల మనస్సులలో ఒక సెన్సార్ వుంటాడు. వాడి కళ్ళు కప్పే ప్రయత్నం చేయకుండ నాసోది నేను చెప్పుకుపోతానంటే దానివల్ల ప్రయోజనం వుండదు. అసలు చెప్పటమయినా మానేసి రాజకీయ ఉద్యమమే మధ్యతరగతిని అభ్యుదయ పంథాలోకి తెస్తుందని ఊరుకోవాలి, లేకుంటే మధ్యతరగతి భాషలో మధ్యతరగతికి చెప్పాలి. ఇందులో మొదటిది ఆచరణశూన్యమయిన బహిష్కరణ (passive boycott). అందులో గొప్పతనంలేదు. రెండవది ఆచరణాత్మకమేగాని అందులో ఒక ఇబ్బంది వుంది. తగినటువంటి పారిభాషిక పదాలులేకుండ, సిద్ధాంత చట్రంలేకుండ, శాస్త్రీయంగా ఆలోచించడం సాధ్యమనే అపోహను అది కలిగిస్తుంది. ఎలెక్ట్రాన్ ప్రోటాన్ అనేపదాలు వాడకుండ భౌతికశాస్త్రాన్ని వివరించలేరా అని ఎవ్వరూ అడగరు, కాని దోపిడీ, బూర్జువా అనే మాటలు వాడకుండ ఈప్రపంచాన్ని వివరించలేరా అనిమాత్రం ప్రశ్నిస్తారు. ఆ ప్రశ్న న్యాయమయినదనే భ్రమ కలిగించకూడదు.

అంతేకాదు, సిద్ధాంతంవరకు పోకున్నా, ప్రపంచాన్ని అర్థంచేసుకునే పద్ధతి లోనే మార్క్సిజానికీ బూర్జువాదృక్పథానికీ మౌలికమయిన తేడావుంది. మార్క్సిజం సమాజానికి (ఎవరి ఇష్టాయిష్టాలతో ప్రమేయంలేకుండ)వున్న భౌతికస్వరూపంతో ప్రారంభించి వ్యక్తిని ఆ సమాజనిర్మాణంలో ఒక నిర్దిష్టమయిన స్థానంగల మనిషిగా అర్థంచేసుకుంటుంది. బూర్జువాదృక్పథం వ్యక్తితోప్రారంభించి అతనికొక 'సహజ' మయిన మనస్తత్వం ఆపాదించి , అటువంటి వ్యక్తులు పరమాణువులుగా ఏర్పడ్డ సమూహంగా సమాజాన్ని అర్థంచేసుకుంటుంది. ఒకటి సమాజంనుండి వ్యక్తిని,

రెండవది వ్యక్తినుండి సమాజాన్ని, నిరూపిస్తాయి. కాబట్టి మార్క్సిస్టు సిద్ధాంత చట్రాన్ని ప్రయోగించకుండ అభ్యుదయభావాలను తెలపాలని ప్రయత్నిస్తే అది అనివార్యంగా వ్యక్తినుండి సమాజాన్ని నిరూపించే బూర్జువావాదచట్రంలో కూరుకుపోయి 'వ్యక్తికి ఆర్థికం ప్రధానం' (man is an economic animal) అనే ఇదర్ర భౌతికవాదానికి దిగజారే ప్రమాదంవుంది. ఉదాహరణకు, కళకుగల భౌతికపునాదిని తీసుకుందాం. ఉత్పత్తి రంగంచేత నిర్ణయించబడే ఉపరితలంలో కళ ఒకభాగం. సామాజిక ఉత్పత్తిచేత నిర్ణయించబడే సామాజిక చైతన్యంయొక్క వివిధ రూపాలలో కళఒకటి. పునాదిలోని వైరుధ్యాలతో సహా పునాదిముద్ర కళమీదవుంటుంది. అంటే కళకు చారిత్రిక స్వభావం, వర్గస్వభావం, ఉంటాయి. ఇది (స్థూలంగా) మార్క్సిస్టు అవగాహన. దీన్ని 'ఎవ్వరికీ అర్థంకాని' ఈ భాషలో చెప్పకుండ 'అందరికీ అర్థమయ్యేటట్టు' బూర్జువా వ్యక్తివాదం చట్రంలో ఇమిడ్చి చెప్పేటప్పుడు ఔత్సాహిక మార్క్సిస్టులు చాలామంది ఈ విధంగా వాదిస్తారు. 'ముందు కడుపుకు తిండి వుంటేగదా కళఅయినా సాహిత్యమయినా' అని. ఇది నిజమే, కాని కళకు సంబంధించి మార్క్సిస్టు అవగాహన మాత్రం కాదు.

ఔత్సాహికులు కానివారుగూడ, వ్యక్తిపరంగా మార్క్సిజాన్ని వివరించే ప్రయత్నంగాని వ్యక్తినుండి సమాజాన్ని నిరూపించే ప్రయత్నంగాని చేయకున్నా, ఉపరితలంతో ప్రారంభించి పునాదిని వెతుక్కోవడమో చైతన్యంతో ప్రారంభించి పదార్థాన్ని వెతుక్కోవడమో చేస్తారు. ఇది కుటుంబరావు రచనలలో విరివిగా కనబడుతుంది. ఉదాహరణకు ఈ సంకలనంలోవున్న 'కళలు' అనే వివాదాస్పదమయిన వ్యాసాన్ని తీసుకుందాం. కళల యొక్క సామాజికపాత్రను వివరించే వ్యాసం ఇది. వివరణ పునాదితో ప్రారంభం కాకుండ ఉపరితలంతోనూ వ్యక్తితోను ప్రారంభమవుతుంది. కళాకారుడు వ్యక్తి. అతను సమాజంలో పుట్టినవాడుగనకా, అతని కళ సమాజంలో చెల్లుబాటుకావాలి గనకా, అతని కళకూ సమాజానికీ సంబంధం వుండి తీరుతుంది ఒక 'నికరమయిన జాతీయ సంస్కృతి' వున్నచోట ఏ వర్గానికీ చెందని జాతీయకళ సాధ్యమేమోగాని, భిన్నవర్గాల 'సంస్కారాలు' భిన్నంగా వున్నచోట ఏ కళాకారుడి కళకు అయినా ఒక వర్గంనుండి ప్రోత్సాహం రావాలి. అంటే అతని కళ మనగలగాలంటే అది వర్గకళకావాలి. ఈ విధంగా కళకుగల వర్గస్వభావాన్ని వ్యక్తిగా కళాకారుడితో ప్రారంభించి ఆవిష్కరిస్తాడు కుటుంబరావు. వర్గవైరుధ్యాల నుండి వర్గకళ పుడుతుందన్నట్టుకాక, కళఅనేది నైరూప్యంగా (abstract) ప్రారంభమయి

వర్గవిభేదాలతో కలుషితమయిన ఈ ప్రపంచంలో అనివార్యంగా వర్గస్వభావాన్ని సంతరించుకుంటుందన్నట్టు ఉంటుంది. దీనిఫలితమే వ్యాసంలోని తక్కిన వివాదాస్పదమయిన విషయాలన్నీ: కళలు నిజజీవితంలోని అడ్డుగోడల్ని ('స్వార్థం, సంఘమర్యాద, వర్గతత్వం') తుడిచేసి, జీవితం నుండి లభించే వ్యక్తిగతమయిన స్పందనను సార్వజనీనం చేస్తాయనీ, ఒకవర్గం కష్టాలపట్ల తక్కిన వర్గాలకు సానుభూతి జీవితం కలిగించలేదుగాని కళలు కలిగించగలవనీ, వగైరా. ఉపరితలంతో ప్రారంభించి పునాదిని వెతుక్కునే తార్కికశైలి ఫలితంగానే (అది తార్కికశైలి మాత్రమే, అవగాహనా లోపం కాదు) కుటుంబరావు కళాసాహిత్యరంగాలను సమాజంకన్న ఉన్నతంగా భావించాడన్న అనుమానానికి తావుకలుగుతుంది.

ఈ శైలికి ఎంతవరకు ఆయన తాత్వికవ్యక్తిత్వంలోని 'వెజిటేరియన్' స్వభావం కారణమో, ఎంతవరకు బూర్జువా పత్రికలలో రాయడంవల్ల ఏర్పడ్డ పరిమితి కారణమో విడదీసి చెప్పడంకష్టం. ఈ లక్షణం లేకుంటే మాత్రం అభ్యుదయాన్ని మార్క్సిస్టు సిద్ధాంత పారిభాషిక చట్రానికి అతీతంగా వివరించడం సాధ్యం కాదనిపిస్తుంది. ఇది ఉలిపికట్టె తత్వంతో అంటున్నమాట కాదు, ఆలోచనమీద అంటున్నదే. ఉదాహరణకు 'అనవసరమయిన నమ్మకాలు' అన్న వ్యాసంవుంది. 'దేవుళ్లనూ మతాన్నీ తుడిచిపెట్టే వ్యర్థప్రయత్నం' ఎందుకుతప్పన్న విషయాన్ని పునాదిని గట్టిగా తడమకుండ బూర్జువా హేతువాదులకు 'వాళ్లభాషలోనే' చెప్పేప్రయత్నం ఈవ్యాసంలో కుటుంబరావు చేసినట్టు కనబడుతుంది. లేకపోతే, మూఢనమ్మకాలను కొన్ని సాముదాయిక రుగ్మతలనీ, కొన్ని ఆపద్ధర్మాలనీ, కొన్ని ప్రమాదకరంకాని విశ్వాసాలనీ, కొన్ని మాత్రమే దోపిడీదారులచేత పోషించబడే ప్రమాదకరమయిన మతమౌఢ్యానికి చెందినవనీ ఎందుకు వర్గీకరించేవాడు? ప్రమాదకరమయిన మూఢనమ్మకాలను మాత్రమే ఎదిరిస్తేచాలు, మిగిలినవి ఉన్నాఫరవాలేదనేవాదం, కలవాళ్ల దగ్గర కట్నం తీసుకున్నా ఫరవాలేదని కొందరు తెలివిమీరిన యువకులు చేసేవాదం లాంటిది. దానికి హేతువాదులు సులభంగా సమాధానం చెప్పగలరు. కనబడ్డలింగానికల్లా లెంపలేసుకోవడం ప్రమాదకరంకాని వెర్రిచేష్టలాగ కనిపించవచ్చు, కాని ఆపనిచేసేవాడి మెదడులోకి రేపు ప్రమాదకరం అయినవికూడ సులభంగా ప్రవేశిస్తాయి. నిజానికి, మూఢనమ్మకాలపట్ల మార్క్సిస్టు దృక్పథాన్ని బూర్జువాతాత్విక పరిభాషకు లోబడి వివరించక పునాదితో ప్రారంభించి విచారిస్తే విషయాన్ని సమగ్రంగా వివరించవచ్చును. ప్రమాదకరమయినవి - కానివి అనేదికాక, వర్గపోరాటానికి ప్రతిబంధకమా కాదా అనేది

సరయిన విభజనగా నిరూపించవచ్చును. ఈ పని కుటుంబరావు చేయగలడు కూడా. డేవిడ్ గెస్ట్ పుస్తకాన్ని సమీక్షిస్తూ 'మార్క్సిస్టు తత్వశాస్త్రం' మీద రాసిన వ్యాసాన్ని చూసినా, లేకపోతే విప్లవ రచయితలకు మార్క్సిస్టు దృక్పథం ఎందుకుండాలో మోటూరి హనుమంతరావుకిచ్చిన సమాధానం (రచయితలు - మార్క్సిజం - రాజకీయాలు') చూసినా, కుటుంబరావు సామర్థ్యాన్ని గురించి అనుమానంరాదు.

అనుసరణీయమో కాదో, తానుఎంచుకున్న కార్యక్రమాన్ని మాత్రం కుటుంబరావు ప్రశంసనీయంగా నిర్వహించాడని చెప్పాలి. వ్యాపార పత్రికలలో మామూలుగా, కాల్పనికసాహిత్యంమాట ఎలాగున్నా, వ్యాసాలస్థాయి చాలాతక్కువగా వుంటుంది. అయితే వెకిలితనమో కాకపోతే శుష్కపాండిత్యాన్ని ఏకరువుపెట్టడమో వాటిలక్షణం. అటువంటిచోట పాఠకులను సీరియస్‌గా ఆలోచింపజేసే వ్యాసాలను ప్రవేశపెట్టి శాస్త్రీయమయిన ఆలోచనాసరణినీ, అభ్యుదయభావాలనూ వ్యాపింపజేయడానికి చాలాదోహదంచేసాడు. ఈ వ్యాసాలకు సాధారణంగా ఒకనిర్దిష్టమయిన విషయం ఉన్నట్టు అనిపించదు. నిర్దిష్టమయిన విషయంవున్నా, వాదానికి స్పష్టమయిన తార్కిక నిర్మాణంవుండదు. సృజనలోనూ అరుణతారలోనూ ఆయనరాసిన వ్యాసాలుగూడ (పుస్తకసమీక్షల్ని మినహాయించి) ఇందుకు భిన్నంకాదు. ఒక విషయం తననుకదిపితే స్పందించి ఆ కదలిక ఎటు తీసుకుపోతే అటుపోయి ఎక్కడో ముగించినట్టుంటుంది. దీనికి దాదాపుగా ఏ వ్యాసాన్నయినా ఉదాహరణగా తీసుకోవచ్చు. 'శాస్త్రజ్ఞానం' అన్న వ్యాసాన్ని తీసుకుందాం. ప్రకృతిలో ప్రతిజంతువుకూ పరిణామక్రమంలో ఒక ప్రత్యేకత ఏర్పడింది. పక్షులకు రెక్కలు, పులికిపంజా, పాముకుకోరలు, వగైరా. మనిషిలో అటువంటి ప్రత్యేకత మెదడు. కాబట్టి ఈ మెదడును పదునుపెట్టుకుంటూ శాస్త్రజ్ఞానాన్ని అభివృద్ధిచేయడంద్వారా ముందుకుపోవడం మానవజాతియొక్క సహజపరిణామం. కాని సామాజికపరిణామం దీనికి విరుద్ధంగావుంది. ఎందుకంటే సమాజం రెండుగాచీలి వర్గసమాజం రూపంతీసుకోవడంతో దోపిడీవర్గాలు తమ అవసరాలకు అనుకూలమయిన మతమౌఢ్యాన్ని శాస్త్రజ్ఞానానికి వ్యతిరేకంగా ప్రవేశపెట్టడం జరిగింది వర్గసమాజ నిర్మాణానికీ మానవుల ప్రకృతిసిద్ధమయిన భౌతికనిర్మాణానికీ మధ్యవున్న వైరుధ్యమిది. ఇది చాలా ఆసక్తికరమయిన విశ్లేషణ. కాని 'శాస్త్రజ్ఞానం' అన్నవ్యాసంలో కుటుంబరావు చెప్తున్నది ఈవిషయమేనని అర్థంచేసుకోవడానికి ఆ వ్యాసాన్ని కనీసం రెండుమూడుసార్లు చదవవలసి వుంటుంది. వాదనాక్రమం సూటిగా

సాగక, మధ్యలో జ్ఞాపకశక్తి ప్రాముఖ్యతగురించి, జ్ఞానాన్నిపంచుకునే పద్ధతిగురించి, 'పరమజ్ఞానం' అనేది లేకపోవడాన్ని గురించి, ఈ వాదనకు అప్రస్తుతమయిన అభిప్రాయాలు పుష్కలంగావుంటాయి.

అయినాసరే కుటుంబరావు చాలా సులభశైలితో రాసాడనే అభిప్రాయం వుండడానికి మూడుకారణాలు కనిపిస్తాయి. ఒకటి, ఆయన చిన్నచిన్న విషయాలమీద గూడ వ్యాసాలురాయడం. రెండు, ఒకవ్యాసాన్ని మొత్తంగాతీసుకుంటే ఎంత అస్తవ్యస్తంగా అనిపించినా అందులో పదివిషయాలను స్పృశించి వాటిమీద తన అభిప్రాయాలను సూటిగాచెప్పడం. మూడవకారణాన్ని కొంతవివరించాలి. వ్యాపార పత్రికల పాఠకులు ఎక్కువగా బూర్జువా సాహిత్యాభిమానులు, కళాభిమానులు. ఆ జాబితామనుషులకు సహజంగావుండే అతిశయంవల్ల వాళ్లు సాహిత్యాన్నీ కళనూ సమాజానికి అతీతమయిన విషయాలగా భావిస్తారు. సాహిత్యమూ సాహిత్యంతోబాటు తామూ సామాజిక వైరుధ్యాలను అంటకుండ దూరంనుండి పర్యవేక్షించి ఈ క్షుద్రమానవుల క్షుద్రమయిన బాధలను జాలిగుండెతో సమీక్షించగల ఉదారమానసులగా బూర్జువా సాహిత్యకారులు తమను తాము భావించుకుంటారు. ఆర్థిక పునాదినుండి సాంస్కృతికరంగాన్ని నిరూపిస్తే వాళ్ళ 'అహం' దెబ్బతింటుంది. అటువంటి నిరూపణ సాధ్యమని కుటుంబరావు నమ్మినవాడే, కాని ఆయన రచనలో ఇటునుండి అటుగాక అటునుండి ఇటువెళ్లడం జరుగుతుంది. పునాదిని వివరించి ఉపరితలాన్ని నిరూపించక, ఉపరితలాన్ని వివరించి పునాదితో 'లింక్' చేయడం కుటుంబరావు పద్ధతి. ఉదాహరణకు 'పుచ్చిపోయిన జీవితం' అనేవ్యాసంలో కళాభిరుచిని గురించి చర్చవుంది. కళాభిరుచిలో సామ్యం (ఏకీభావం) ఉండడంఅనేది మనుష్యులను ఏకం చేసే శక్తులలో ఒకటిఅనీ, అది సమాజంలో నిస్సందేహంగా ప్రగతిశక్తి అనీచెప్పి, ఈ విధంగా అంటాడు: "కళాభిరుచివల్ల ఒక కవినిగాని, రచయితనుగాని, గాయకుడినిగాని, నటుడినిగాని అభిమానించేవాళ్లంతా ఏకమవుతారు. ఈ అభిరుచి సంఘంలోవుండే మామూలు అడ్డుగోడలన్నిటినీ దూసుకుపోగలదు. అలాంటి పరిస్థితిలో ఆయాకళాకారులు తమ కళలద్వారా ప్రత్యేక సామాజిక ప్రయోజనాన్ని సాధించడానికి పూనుకున్నవారైతే కళాభిరుచులుగలవారు కనీసం మానసికంగా ఆ ప్రయోజనాలకు సుముఖులవుతారు." మామూలుగా మార్క్సిస్టు రచయితలు ఈ విషయాన్నే ఇలాచెప్తారు : కళకు అభ్యుదయకరమయిన సామాజిక ప్రయోజనం ఉండాలి. ఆ ప్రయోజనాన్ని కళ సమర్థవంతంగా సాధించాలంటే తదనుగుణ్యమయిన

కళాభిరుచిగూడ ప్రజలలో అభివృద్ధిచెందాలి. అభ్యుదయ ప్రయోజనంగల కళపట్ల అభిరుచి కలిగివుండడంలో ఏకమయినవారంతా బలమయిన ప్రగతిశక్తిగా రూపొందు తారు. కుటుంబరావు వాదనాక్రమం దీనికి సరిగ్గా తలక్రిందులుగా కనిపిస్తుంది.

ఈ వాదనాపద్ధతే కుటుంబరావులో ఏకసమయంలో ధనాంశా రుణాంశా రెండూ గూడ. అది రుణాంశ ఎందుకయిందో పెద్దగా వివరించనక్కర లేదనుకుంటాను. ధనాంశ ఎందుకయిందంటే, కేవలం ఆ పద్ధతే బూర్జువాపాఠకులకు మింగుడు పడుతుందనికాదు. అంతమాత్రమే అయితే లెక్కించనవసరంలేదు. అంతకంటే ముఖ్యమయిన కారణం మరొకటివుంది. అదే బహుశా కుటుంబరావు రచనలపై ఆయన స్వంత 'ముద్ర' అనుకుంటాను. ఉపరితలానికి పునాదినుండి సాపేక్షమయిన స్వాతంత్ర్యంఉందని మార్క్సిజం అంటుంది. కాని ఒక ఉపరితలఅంశాన్ని పరి శీలించేటప్పుడు ఈ సాపేక్షస్వాతంత్ర్యం పరిధి ఏమిటో విస్తృతిఎంతో అది రూపం తీసుకునే తీరేదో దానిఫలితమేమిటో మార్క్సిజం ఒక ఫార్ములారూపంలో చెప్పదు, చెప్పలేదు, నిజానికి ఈ విషయాలను నిర్ణయించడమే పరిశీలనలో ఒక ముఖ్యఅంశ మవుతుంది. విషయం 'చిన్న'దయేకొద్దీ సాపేక్షస్వాతంత్ర్యం పెరుగుతుంది కాబట్టే చాలమంది మార్క్సిస్టులు పెద్దవిషయాల గురించి మాత్రమే, అదీ విశాలమయిన చారిత్రిక పరిధిలోనే, పరిశీలిస్తారు. నాలుగులైన్ల కవితను మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించడంకష్టం. 20వ శతాబ్దపు తెలుగుసాహిత్యాన్ని విశ్లేషించడం సులభం. అందుకు భిన్నంగా వివిధ ఉపరితల అంశాలగురించిన విశ్లేషణ తడబాటులేకుండ కుటుంబరావు ఇవ్వగలిగాడు. ఉపరితలాన్ని పరిశీలించేటప్పుడు పునాది ఎక్కడ పారి పోతుందో అన్నట్టు మాటమాటకూ దోపిడీసంబంధాలను ప్రస్తావించి అసలు విష యాన్ని గందరగోళపరిచే పిడివాదపు పద్ధతికాక, పదిశాతం పునాదికి కేటాయించి తొంబయిశాతం ఉపరితలం పరిధిలోనే వ్యవహరించే ఆలోచనాపద్ధతి దీనికికారణం. కొన్ని ఉదాహరణలు తీసుకుందాం. కళాభిరుచియొక్క ప్రాధాన్యతను గురించి కుటుంబరావు చెప్పిన విషయాలు పైనచూసాం. కళకూ కళావిమర్శకూ మధ్యవున్న సంబంధాన్ని గురించిగూడ రెండుమూడుచోట్ల వివరించాడు. విప్లవసాహిత్యం అభి వృద్ధి చెందాలంటే దానితోబాటు విప్లవసాహిత్య విమర్శ అభివృద్ధిచెందాలి. (కుటుంబ రావు ఇట్లాచెప్పడు. మంచిసాహిత్యం రాయాలంటే మంచివిమర్శ రావాలంటాడు. ఏమిటీ 'మంచి'అని మనం చిరాకుపడబోతుండగా, 'మంచి'అంటే దాని వర్గస్వభా వాన్ని బట్టి వుంటుందని చివర్లో వివరిస్తాడు.) ఈ విమర్శ సాహిత్యకారులకు ప్రజల

జీవితానికీ తమసాహిత్యంయొక్క నిర్మాణానికీ వస్తువుకూ వున్న సంబంధాన్ని వివరించడమే కాక, పాఠకులలో ఆ సాహిత్యంపట్ల అభిరుచిని పెంచుతుందిగూడ అని కుటుంబరావు గుర్తించాడు విప్లవరచయితలకు సిద్ధాంతాన్ని బోధించడంలో నిమగ్నమయిన విప్లవ సాహిత్యవిమర్శ ఈ రెండవవిషయాన్ని కుటుంబరావునుండీ నేర్చుకోవలసివుంది. విప్లవ సాంస్కృతికరంగం ప్రజలు కొత్తగా 'అభిరుచి' సంపాదించుకోవలసిన అవసరంలేని పాటకు పరిమితమయివుండక, లిఖితసాహిత్యం, చిత్రలేఖనం, మొదలయినవాటినికూడ తనలోకి ఇముడ్చుకోగలిగిననాడు ఇదిచాలా అవసరమవుతుంది.

'రెండురకాల సాహిత్యం' అనే వ్యాసంవుంది. ఇందులో కుటుంబరావు సాహిత్యాన్ని జాతి అంతటికీ చెందిన సాహిత్యం, ఒక ప్రాంతానికి మాత్రం చెందిన సాహిత్యం, అని విభజిస్తాడు. ఈ విభజన లిఖితసాహిత్యం - మౌఖికసాహిత్యం అనే విభజనలాగ పునాదిని తాకదు సాహిత్యం 'జాతీయమా' లేక 'ప్రాంతీయమా' అనేది సాహిత్య ఉపరితల విషయమేగాని సారాంశానికి సంబంధించినదికాదు. అయినా ఈ విభజన సారస్వత చరిత్రలోని ఒకముఖ్యపరిణామక్రమాన్ని వివరించడానికి చక్కగా వినియోగపడుతుంది. ఒక సమాజంలో ఎప్పుడూగూడ ఒక ప్రామాణిక సాహిత్యముంటుంది. అది ఆసమాజం యొక్క నిర్దిష్టమయిన వర్గనిర్మాణాన్ని అనుసరించి ఆ సమాజం యొక్క సాహిత్య అవసరాలను తీరుస్తుంది అయితే కొత్త ప్రేరణ ఒకటి ఆ సమాజంలో ఆకస్మికంగా తలెత్తితే (ప్రస్తుతం మన గ్రామాలలోని రైతాంగ పోరాటాల లాంటిది) అది సృష్టించే అవసరాన్ని 'ప్రామాణిక' సాహిత్యం తీర్చలేదు. కొత్త సాహిత్య పోకడలు పుట్టుకొస్తాయి. ఆప్రేరణ ఆదిలో ప్రాంతీయం కావడంవల్ల ఆ కొత్తపోకడలకుగూడ 'ప్రాంతీయ' స్వభావముంటుంది. అయితే ఆప్రేరణ పుట్టినంత ఆకస్మికంగా నశించక విస్తృతిని సాధించుకునేటట్లయితే ఆకొత్త పోకడలుగూడ విస్తరించి ప్రామాణిక సాహిత్యంలో భాగమవుతాయి. వాటికి వ్యతిరేకమయిన అంశాలు ప్రామాణిక సాహిత్యంలో గనకవుంటే అవి నాశనమయి కొత్త తరానికి దారిఇస్తాయి. ప్రామాణిక సాహిత్యం స్వరూపమే అంతమేరకు మారిపోతుంది. సాహిత్య పరిణామక్రమం యొక్క గతితర్కంలోని ఒక ముఖ్య అంశాన్ని (ఉపరితలం పరిధిలోనే) ఇది చక్కగా వివరిస్తుంది.

ఈ సాహిత్య సంబంధమయిన వ్యాసాలన్ని ఒక ఎత్తయితే కుటుంబరావు చరిత్ర గురించి రాసినవ్యాసాలు ఒకెత్తు. ఈ సంకలనంలో అటువంటి వ్యాసాలు

మూడు ఉన్నాయి. 'శాస్త్రజ్ఞానం' అన్న వ్యాసంలో కుటుంబరావు శాస్త్రీయదృక్పథం ఏర్పడాలంటే చరిత్ర గురించి గూడ శాస్త్రీయంగా ఆలోచించాలి అంటాడు. ఆయన వివరించకుండ గాలిలోకి విసిరేసిన అమూల్యమయిన వాక్యాలలో ఇది ఒకటి. చరిత్రను గురించి శాస్త్రీయంగా ఆలోచించడం నేర్చుకుంటే తక్కిన అన్ని విషయాల గురించీ శాస్త్రీయంగా ఆలోచించగలుగుతాం. ఎందుకంటే శాస్త్రీయమయిన ఆలోచన లేకపోవడానికి కారణం కేవలం మానసికమయిన బద్ధకం కాదు. చరిత్రనుండి సంక్రమించిన సామాజికశక్తులు సాంస్కృతిక రూపం తీసుకొని మన మనసులలో అభ్యుదయ నిరోధకమయిన గుదిబండలలాగ కూర్చుంటాయి. వాటిని కదిలించాలంటే వాటిమూలం తెలుసుకోవాలి. కులతత్వం, మతమౌఢ్యం, శ్రామికవ్యతిరేకత, ఇవన్నీ అటువంటి గుదిబండలు. వీటిమూలాన్ని చరిత్రలో వెతుక్కొని విశ్లేషించి విసర్జించనిదే మనం దేన్నిగురించీ శాస్త్రీయంగా ఆలోచించలేం.

ఈ దృష్టితో చూస్తే మనదేశచరిత్రను శాస్త్రీయంగా విశ్లేషించే ప్రయత్నం చాలా కాలం అసలు జరగకపోవడం, జరుగుతున్న గత 15-20 సంవత్సరాల కృషిఫలితం యూనివర్సిటీలకు పరిమితం అయిపోవడం, విచారించవలసిన విషయాలు. ఈ ఖాళీని పూరించే సమగ్రమయిన ప్రయత్నం కుటుంబరావు చేయకపోయినా, చరిత్ర గురించి మూసపద్ధతిలో కాకుండ శాస్త్రీయంగా ఆలోచించే ఆసక్తిని రేకెత్తించగల విషయాలు తన వ్యాసాలలో చెప్పాడు. ఎక్కువగా మన పురాణతదితర ప్రాచీన సాహిత్యం మీద 'కామెంట్స్' రూపంలో చెప్పాడు. 'చరిత్ర - పురాణమూ' అనే వ్యాసం వుంది. రామాయణంలో మొదట్లో లేకుండ తరువాత చేర్చబడ్డ అంశాలను (ప్రక్షిప్తాలను) ప్రస్తావిస్తూ, ఒకప్పుడు రాముడికి మిత్రుడయిన గుహుడు తరువాతికాలంలో భక్తుడయ్యాడంటాడు. రాముడు నాగరిక (అంటే వర్గసమాజ) ప్రతినిధి. గుహుడు ఆటవికుడు. అంటే ఆదిమసమాజ ప్రతినిధి. మనదేశంలో నాగరిక సమాజం ఆటవిక సమాజాన్ని కబళించే పోరాటం ఇప్పటికీ పూర్తికాలేదు. హిందూధర్మాన్ని అంగీకరించని ఆటవికులకు మ్లేచ్ఛులనీ కిరాతులనీ రాక్షసులనీ పేర్లుపెట్టి వాళ్ళను హింసాత్మకంగా అణిచేసిన ప్రాచీనకాలంనుండి రెండేళ్ళక్రితం ఇంద్రవెల్లిలో జరిగిన మారణకాండ దాకా ఈ కబళింపుక్రమం రక్తసిక్తమయినది. ఇప్పటి కథ పక్కకుపెట్టి చరిత్రలోకిపోతే, మెట్టుమెట్టుగా ఒక్కొక్క ఆటవిక జాతినీ లోబరచుకొని వాటిని కులాలగామార్చి హిందూ వర్ణవ్యవస్థలో అధోభాగాన స్వీకరిస్తూరావడం జరిగింది. ఈ క్రమంలోనే, నాగరిక ప్రభువయిన రాముడితో ఒకప్పుడు సమాన హోదాగల ఆటవిక ప్రభువయిన గుహుడు తరువాతి కాలంలో రాముడికి భక్తుడయి

సపర్యలుచేసే స్థితికి దిగజారాడు. ఈ విధంగా నాగరిక వర్గసమాజానికి లొంగిపోవ డమే ఆటవిక సమాజాలకు 'విముక్తి' మార్గమన్న భావానికి ప్రచారంగానే శబరి అనే ఆటవిక స్త్రీ కథను సృష్టించి రామాయణంలోకి ఇరికించారని గూడ కుటుంబరావు సూచిస్తాడు. ఆటవిక సమాజాల చారిత్రిక 'విముక్తి' సాహిత్యరూపం తీసుకొని శబరికి పౌరాణిక 'ముక్తి' అయింది.

హిందూదేవుళ్లలో ఇంద్రుడికి పట్టినగతికూడ మనచరిత్రను చక్కగా ప్రతి బింబిస్తుంది. ప్రాచీనకాలంలో ఇంద్రుడు ఆర్యులకు ముఖ్యమయిన దేవుళ్లలోఒకడు. కృష్ణుడు, విష్ణువు, శివుడు, వీళ్లందరూ ఆర్యులకు ఇంకా దేవుళ్లకాకపూర్వం మాట యిది. అప్పటికి ఆర్యులింకా గణసమాజంలో నివసిస్తున్నారు. పశువులను పోషించు కుంటూ దేవుళ్లకు యజ్ఞాలుచేస్తూ జీవించిన వేదకాలంఅది. తరువాతికాలంలో క్రమంగా ఈ పశుపోషకులు తాము వ్యవసాయంచేపట్టడం, వ్యవసాయం చేయగల ఇతరతెగలను తమలోకి ఇముడ్చుకోవడం, జరిగింది. ఆ ఇతర తెగలదేవుళ్లనుగూడ తమదేవుళ్లుగా స్వీకరించక తప్పలేదు ఆర్యులకు. అట్లా వ్యావసాయక సమాజపు దేవుళ్లుగా వచ్చిచేరినవాళ్లు కృష్ణుడు తదితరులు. వీళ్లరాకతో ఇంద్రుడి పరపతి పడి పోయి వేదకాలంపోయి పురాణకాలం వచ్చేనాటికి లోఫర్‌గామిగిలాడు. ఇంద్రుడు తప్పులుచేసి విష్ణువు శరణువేడడం, కృష్ణుడితో తగువులాడడం, ఇవన్నీగూడ వ్యావ సాయక సమాజానికీ ఆదిమసమాజానికీ మధ్యవున్న ఘర్షణను, ఆ ఘర్షణలో వ్యావ సాయక సమాజం విజయాన్నీ, సూచిస్తాయి. మహాభారతంలోని ఖాండవ వనదహన ఘట్టాన్ని కుటుంబరావు ఈ దృష్టితో చక్కగావివరిస్తాడు. అడవినికాలబెట్టి వ్యవ సాయ యోగ్యంగా మార్చడం ఇప్పటికీ ఆటవికులుచేసేపనే. ఇవ్వాళ సస్యశ్యామల మైదానంగావున్న గంగాయమునా తీరప్రాంతం ఒకప్పుడు దట్టమయిన అడవిగా వుండేది. ఆ అడవిని కాలబెట్టి, నరికి, వ్యవసాయయోగ్యంచేసే క్రమం దాదాపు 3000 సంవత్సరాలకిత్రం ప్రారంభమయింది. కోశాంబిఅన్నట్టు కృష్ణార్జునులు ఖాండవవనాన్ని తగలబెట్టడం ఈ పరిణామాన్నే సూచిస్తుంది. ఆ వనదహనంమీద ఇంద్రుడు వర్షంకురిపించడం, అతనికీ అతన్ని దేవుడిగా ఆరాధించిన ఆదిమ సమా జానికీ వ్యావసాయక సమాజంతోవున్న వైరుధ్యాన్ని ప్రతిబింబిస్తుందని కుటుంబరావు శాస్త్రీయంగా వ్యాఖ్యానిస్తాడు.

కుటుంబరావు కాల్పనిక సాహిత్యంనుండి విరమించుకోవడంతో ఒక మంచి కథకుడుపోతే, ఆయన మరణంతో ఒక మంచి సామాజికవ్యాఖ్యాత పోయాడు.

# కన్నుల్లో మెరుపాయె

దేవ్‌సింగ్

మానాల ఈచివర
ఎల్లరెడ్డి ఆ చివర
తండతండ కదిలివెళ్లి
పొద్దుపొద్దునే నాగలెత్తి-
సీర్నపెల్లి - నల్లవెల్లి
కోనపురం - కోనసముద్రం
ఎల్లరెడ్డి - ఎల్లంపేట
రామరెడ్డి - రెడ్డిపేట
బీడుభూముల్లో - అడివిభూముల్లో-
చెట్టుచెట్టు - పెల్లపెల్ల
పెకిలించి - పెల్లగించి
ఎర్రిజెండా నీడలోన
ఎర్రిదండులా సాగిమీరు
పాలుపైన పాలువేసి
అడుగులోన అడుగువేస్తే-
లంబాడీ తండాలు
తండలోని లంబాడీలు
మదిలోన మెదల-
పొంగిపోయాం - ఇక్కడ.

* * * *

తండ తండ తిరిగి తిరిగి
గుండె గుండె కదిపి కదిపి
గుండెలల్లో గూడుకట్టి
అడివి కడుపులో కన్నుమూసిన
రాంచందర్ భయ్యా....
ఎర్రిజెండాలో ఎరుపాయె
మా కన్నుల్లో మెరుపాయె

(నిజామాబాద్ జిల్లాలో కామారెడ్డి, భీంగల్ తాలూకాల లంబాడీ రైతాంగం పోరుబాటలో ముందుకు సాగుతున్నారనివిని....)

విప్లవ సాహిత్యం-

# వాస్తవాలు - విశ్లేషణలు

ఏ అంశమైనా విశ్లేషించడానికి రెండురకాల పరిశీలనాపద్ధతులుంటాయి. ఒక పద్ధతి వాస్తవాల ఆధారంగా వాదనలను నిర్మిస్తుంది. మరొకపద్ధతి స్వీయమానసిక దృష్టితో వాస్తవాలపట్ల కొన్ని అభిప్రాయాలేర్పరుచుకుంటుంది. ఈ అభిప్రాయాలకు కూడ ఎంతోకొంత భౌతికపునాది ఉండక తప్పదుగాని వాటి ప్రధానలక్షణం వాస్తవాలను వికృతరూపంలో అవగాహన చేసుకోవడమే. తెలుగు సాహిత్యంలో, తెలుగు సాహిత్యాన్ని విశ్లేషించడంలో ఈ రెండురకాల పద్ధతులు నిత్యం సంఘర్షిస్తూనే ఉన్నాయి. ఈ మధ్యకాలంలో ప్రబలంగా ముందుకొచ్చిన రెండు స్వీయమానసిక వాదనల నేపధ్యంలో తెలుగు సాహిత్యంలో నేటిస్థితిని వాస్తవాల ఆధారంగా, సరైన భౌతిక పునాదిపై సక్రియంగా అంచనావేయాల్సిఉంది. ఈ రెండువాదనలు - ఒకటి ప్రస్తుతసాహిత్యంలో స్తబ్దత, రెండు, విప్లవ సాహిత్యోద్యమ వైఫల్యాలు- ఏరకంగా వాస్తవాలమీద ఆధారపడిలేవో, ఎందువల్ల ఆ వాదనలను తిరస్కరించాలో అర్థం చేసుకోవాలంటే, ఈ వాదనల వెలుగు(?)లోనే ప్రస్తుత తెలుగు విప్లవ సాహిత్యోద్యమాన్ని పరిశీలించాల్సిఉంది.

విప్లవ సాహిత్యోద్యమ ప్రారంభదినాలలో విప్లవ సాహిత్యం ప్రచురించడానికి ఒకే ఒక పత్రిక ఉండేది. ఒకటిరెండు ఇతర పత్రికలు విప్లవ సాహిత్యానికి అప్పుడప్పుడు చోటిచ్చినా ప్రధానంగా విప్లవసాహిత్యోద్యమానికి ఆకాలంలో ఒకే పత్రిక ప్రాతినిధ్యం వహించేది. కొన్నాళ్ళకి బులెటిన్లరూపంలోనో, సైక్లోస్టైల్ కరపత్రికల రూపంలోనో మరికొన్ని పత్రికలుపుట్టుకొచ్చాయి. స్వయంగా విప్లవోద్యమానికే ప్రాతినిధ్యంవహించే పత్రికలువచ్చి విప్లవసాహిత్యానికి మరికొన్ని కొత్తద్వారాలు తెరిచాయి. ఆ తర్వాతసాగిన ఎమర్జెన్సీ నిర్బంధంలో అచ్చుపత్రికలు ప్రచురించే అవకాశం లేకపోయినా విప్లవ సాహిత్యోద్యమం జైళ్ళలో లిఖితపత్రికల్లో తనను తాను ఆవిష్కరించుకుంది. ఎమర్జెన్సీ తర్వాత విప్లవసాహిత్యోద్యమ పత్రికలు ఒకటికి నాలుగయ్యాయి. విప్లవోద్యమ పత్రికల సంఖ్యకూడ చాలపెరిగి సాహిత్యానికి వాటిలో స్థానం దొరకడం మొదలైంది. దాదాపు ప్రతి జిల్లాకేంద్రం నుంచి విప్లవ సాహిత్యాన్ని ప్రచురించేపత్రికో, బులెటినో, కరపత్రికో రావడం మొదలైంది. ఇవాళ తెలుగు విప్లవ సాహిత్యోద్యమానికి ఏదో ఒక రకంగా ప్రాతినిధ్యంవహించే పత్రికల సంఖ్య డజనుకు పైచిలుకయింది. పదమూడుసంవత్సరాలకింది ఒక్క-

పత్రికతో ప్రారంభించి విప్లవసాహిత్యోద్యమం ఇవాళ కనీసం డజనుపత్రికలకు విస్తరించింది. విరసం, జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య, జననాట్యమండలి, అరుణోదయ, నవోదయ సభ్యత్వాలు పక్కన పెట్టిచూసినా, ఇవాళ్టి తెలుగు సాహిత్య రంగంలోనే విప్లవంపట్ల ఆసక్తిగల వాళ్ళసంఖ్య లెక్కకు మిక్కుటంగాఉంది. సాహిత్య సాంస్కృతిక రంగాలలో అడుగుపెడుతున్న ప్రతిఒక్కరూ విప్లవాన్ని గానం చేస్తున్నారు. విప్లవసాహిత్యోద్యమ నిర్మాణరూపాలలోకూడ దాదాపు ఏఒక్కదానిలో పాతనీరులేదు. ఈ సంఘాలన్నిటి సంస్థాపకసభ్యులలో చాలా కొద్దిమందితప్ప ఇప్పుడా సంఘాలలోలేరు. ఐనా విప్లవసాహిత్యోద్యమం నానాటికీ పురోగమిస్తూనేఉంది. ఇందుకు పైనచెప్పినట్టు విప్లవసాహిత్య పత్రికల విజృంభణే ఒక నిదర్శనం. పరిమాణంరీత్యా ఇంత ఎక్కువస్థాయిలోవస్తున్న విప్లవసాహిత్యం ప్రమాణాల రీత్యా ఏ స్థాయిలో ఉంది?

ప్రచురితమవుతున్న రచనలలో తప్పనిసరిగా సగానికన్న ఎక్కువ రచనలు పాఠకులను కదిలించగలుగుతున్నాయి. కళావిలువల దృష్ట్యా ఈ రచనలన్నీ 'మంచి' రచనలుకావని ఒక ఆరోపణ తలెత్తుతోంది. విప్లవసాహిత్యం ఏ కళావిలువలను 'మంచి' కళావిలువలు అనాలి, ఏ కళావిలువలను తిరస్కరించాలి అనే విషయంతో స్వీయమానసికవాదులకు స్పష్టమైన దృక్పథం లేదు. వాళ్ళవాదనలలో మంచిరచనలు కరువవుతున్నాయనే మాట తరచువినబడుతోంది, కాని, ఈ 'మంచి' స్వరూపస్వభావా లేమిటో వాళ్ళు స్పష్టంగా నిర్వచించడంలేదు. మావో చెప్పినట్టు "....ఎవరికొరకు అనే సమస్యపై ఈ కామ్రేడ్స్‌కు స్పష్టతలేకపోవడంవల్ల వాళ్ళుమాట్లాడే ప్రమాణాల పెంపుదల, ప్రజాదరణలకు సరైనకొలబద్దలేమిటో అవగాహనలేదు. ఆ రెంటి మధ్య ఉండవలసిన సంబంధాన్ని గురించి కూడా వాళ్ళు తెలుసుకోలేకపోతున్నారు. మన సాహిత్యమూ కళలూ మౌలికంగా శ్రామికులకోసం, రైతులకోసం, సైనికుల కోసం. కనుక ప్రజాదరణ అంటే కార్మికులలో, రైతుల్లో, సైనికుల్లో ప్రచారాన్ని పొందడం. ప్రమాణాల పెంపుదల అంటే వాళ్ళను వాళ్ళప్రస్తుత చైతన్యస్థాయి నుంచి పురోగమింపజేయడం...." ఈ అవగాహన లేకుండా ప్రస్తుత తెలుగు విప్లవ సాహిత్యంలో 'మంచి' రచనలు కరువవుతున్నాయని వాపోవడమంటే విప్లవసాహిత్య ప్రమాణాలకూ, సాంప్రదాయిక సాహిత్య ప్రమాణాలకూ ఉన్నతేడాను గుర్తించక పోవడమే. మన ప్రమాణాలు ఎంతమాత్రమూ సాంప్రదాయిక ప్రమాణాలుకావు. సాంప్రదాయిక ప్రమాణానికి ప్రయోజనం ఏమిటి? రససిద్ధి, ఆనందానుభూతి.

పఠితలకు రససిద్ధి కలిగించడమే పరమావధిగా భావించే సాహిత్యానికీ, మన సాహిత్యానికీ ఉచ్చితంగా ప్రమాణాలలో తేడా వుడకతప్పదు. మన ప్రమాణానికి కూడ ప్రయోజనం అదే అయినప్పుడు మనం ఆ ప్రమాణాన్నే స్వీకరిస్తాం. మన కవిత్వం కృష్ణశాస్త్రి కవిత్వంలాగనో, తిలక్ కవిత్వం లాగనో లేదంటే, ఆ ఆరోపణను మనం నిజానికి సగర్వంగా స్వీకరించాలి. మనకవిత్వం ద్వారా ఉద్దేశిస్తున్న ప్రయోజనం నిరాశకాదు, వేదనకాదు, అనిర్దిష్టమైన మానవతావాదంకాదు. మన పూర్వసాహిత్య ప్రయోజనానికీ, మన సాహిత్య ప్రయోజనానికీఉన్న విభేదం మన కళావిలువలలో కూడ ప్రతిఫలించక తప్పదు. కథ విషయంలోనైనా, నవల విషయంలోనైనా, సాహిత్యవిమర్శ విషయంలో ఏ ప్రక్రియ విషయంలోనైనా ప్రమాణాన్ని నిర్వచించ డానికి ప్రయోజనమే ప్రాతిపదికఅవుతుంది. ఐతే మనకు కళావిలువలంటూ లేవా? తప్పకుండా ఉన్నాయి. అశేషప్రజానీకానికి మనసుకు హత్తుకునేట్టు చెప్పడమే మన కళావిలువ. మనంరాస్తున్న ప్రతిమాటనూ అగ్నిసదృశకాంక్షతో జ్వలింపజేసి పాఠకులలో ఆ స్పందనను కలిగించడమే మన ప్రమాణం. ఈ ప్రమాణం విషయంలో మనం ఏమాత్రమైనా విజయం సాధించి ఉండకపోతే ఇవాళ విప్లవసాహిత్యోద్యమం వెనుక, విప్లవోద్యమం వెనుక ఇంతశక్తి ఉండేదికాదు. పదమూడేళ్ళకిందటి ఉద్యమం నెలబాలుడు ఇవాళ్టి ఆజానుబాహుడూ, అనంతబల సంపన్నుడూ అయిఉండేవాడేకాదు. ఈ మాటచెప్పి కళావిలువల విషయంలో మన సాహిత్యం శిఖరాలకు చేరిందనీ, ఇక పురోగమించనవసరంలేదనీ అనడం లేదు. తప్పనిసరిగా మన కళావిలువలు ఇంకా మెరుగుపడవలసే ఉన్నాయి. మన పరిధి ఇంకా విస్తరించవలసే ఉన్నది. కాని ఇవాళ్టికివాళ ఒక్కక్షణంఆగి గతాన్నీ, వర్తమానాన్నీ వాస్తవాల ఆధారంగా అంచనావేస్తే తప్పకుండా 'మంచి' విప్లవసాహిత్యమే వచ్చింది వస్తోంది. ఇప్పటి మన సాహిత్యంలో సగానికన్నా ఎక్కువ మంచి సాహిత్యమే ఉంది.

విప్లవ సాహిత్యంలో కొత్తదనం, మౌలికతలోపిస్తున్నాయని ఒక ఆరోపణ వినవస్తోంది. నిజానికి తెలుగు విప్లవ సాహిత్యంలో ఈ రెండు లక్షణాలు నానాటికీ అభివృద్ధి చెందుతున్నాయేగాని లోపించడంలేదు. విప్లవ సాహిత్యోద్యమ ప్రారంభ దినాలలోగానీ, ఎమర్జెన్సీ ముందుగానీ మన సాహిత్యంలో జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై ప్రవచనాలు, 'నినాద' సాహిత్యం విరివిగానే ఉండేవి. 'నినాద' సాహిత్యమనే శత్రుఆరోపణ ఒప్పుకోవడం కాదుగాని ఆరోజుల సాహిత్యంలో పేలవమైన వ్యక్తీకరణలు ఇవాళ్టితో పోలిస్తే ఎక్కువేఉండేవి. అయినా వాటిలోనూ

క్రమానుగత అభివృద్ధి లేకపోలేదు. ఏదేమైనా ఎమర్జెన్సీ ముందుకాలపు విప్లవ సాహిత్యపరిధి ప్రధానంగా విప్లవాచరణకు ఆహ్వానం పలకడమే. ఎమర్జెన్సీ తర్వాతి కాలపు విప్లవసాహిత్యంలో ప్రజాజీవితచిత్రణా, విప్లవాచరణకు ఆహ్వానమూ పడుగూ పేకలా కలిసిపోయాయి. రెండూ సముచిత స్థానాల్నిపొందాయి అందుకు తగ్గ ప్రభావాన్ని చూపించాయి, అంచుకుతగిన ప్రాబల్యాన్ని సంపాదించుకున్నాయి. ఈ రకంగా నేటి విప్లవసాహిత్యం కొత్త పుంతలు తొక్కుతోంది. దీనినుంచే మౌలికత కూడ వస్తుంది. ప్రక్రియకు కనీసం ఒక్క ఉదాహరణ చొప్పున చూపాలంటే కవిత్వంలో 'లాల్ బనో గులామీ చోడో', కథ / కథనంలో కిసింగార్ లెంతా నుంచి మరట్ తుడుం పాయానా, నవలల్లో కొలిమంటుకున్నది, సాహిత్య మర్మలో మధుసూదనరావు, బాలగోపాల్ వ్యాసాలను చూపొచ్చు. ఇంక కవిత్వంలో పాట సాధించిన విజయాలను, అధిరోహించిన శిఖరాలను ప్రస్తావిస్తే కోకొల్లలుగా దొరికే ఉదాహరణల నుంచి మచ్చుకి ఎంచుకోవడంకష్టం. అభ్యుదయ సాహిత్యోద్యమ కాలంనుంచే ఆర్ ఎస్ ఎస్ ఉన్నది. నాడుగానీ, ఈ పదమూడేళ్ల విప్లవ సాహిత్యోద్యమంలో గానీ ఆర్ ఎస్ ఎస్ భావజాలాన్ని బలంగా, ప్రతిభావంతంగా కళారూపంలో ఎండగట్టే ప్రయత్నమే జరగలేదు. తెలుగునాట ప్రగతిశీల కవిత్వానికి సంబంధించి ఇది కొత్తరంగం. ఈ కొత్తరంగంలోకి ఈ కాలంలోనే మన విప్లవ కవిత్వం ప్రవేశించింది.

ఈ ప్రవేశానికి అవసరమయిన భౌతిక పరిస్థితులు విప్లవోద్యమం మైదాన ప్రాంతాల్లో విస్తరించినాకొద్దీ పెరిగింది. విద్యాలయాలు, సాహిత్య కళాసాంస్కృతిక రంగాలు విప్లవోద్యమ ప్రభావంలో తీవ్రమయినమార్పుకు గురవుతున్న తరుణంలో కాంగ్రెస్‌వంటి దివాళాకోరు రాజకీయాలను ఆశ్రయించిన భూస్వామ్యవ్యాపార వర్గాలకు యువతరాన్ని విద్యార్థులను ఆకర్షించడానికి ఒక శక్తివంతమైన మిలిటెంట్‌గా కనిపించే పైకి జాతీయభావంగా కనిపించే ఒక అభివృద్ధినిరోధక సిద్ధాంతం అవసరమైంది. ఆ సిద్ధాంతమే ఆర్. ఎస్. ఎస్, ఎ.బి వి.పి రూపాల్లో వచ్చింది. కనుక సహజంగానే భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలతో వర్గపోరాటంలోవున్న విప్లవ శ్రేణులకు సాంస్కృతికరంగంలోకూడ వర్గపోరాటం చేయక తప్పడంలేదు. భౌతిక దాడులుచేస్తూ జాతీయవాదం, దేశభక్తి ముసుగులో జాతీయ దురహంకారాన్ని పాలక వర్గ సంస్కృతిని కాపాడుతున్న ఆర్.ఎస్.ఎస్‌ను పునాదిలో భూస్వామ్య ఉత్పత్తి సంబంధాలమీద పోరాటంచేస్తున్న విప్లవకరవర్గాలు ఉపరితలంలోకూడ దాని సంస్కృ

తిక పునాదులను ఎండగట్టాల్సిన తరుణంవచ్చింది. ఎమర్జెన్సీలో ఇందిరాపాలనను వ్యతిరేకించడంవల్ల నిర్బంధాలు ఎదుర్కొన్న ఈ ఆర్.ఎస్.ఎస్. ఎమర్జెన్సీ ఎత్తివేసింతర్వాత ఇందిరాకాంగ్రెస్‌కు వ్యతిరేకంగా కాదుగదా ఆపార్టీచేతిలోని లాఠీవలె విప్లవోద్యమంపై దాడిచేయడం తెలంగాణాజిల్లాల్లో యిటీవల తీవ్రతరమవుతున్నది. కనుక దీని స్వభావ స్వరూపాలను సాంద్రతర భావోద్విగ్నతరూపంలోను చారిత్రిక విశ్లేషణద్వారాను ఎండగట్టేకర్తవ్యాన్ని విప్లవసాహిత్యోద్యమం నిర్వహించింది.

అట్లాగే తెలంగాణ పోరాటకాలంనుంచికూడ గిరిజనులతో విప్లవకారులకు అన్యోన్యసంబంధాలే ఉన్నాయి. శ్రీకాకుళం నాటికి ఇది మరింతఎక్కువైంది. కాని '40 ల నుంచి ఇప్పటిదాకా ఎక్కడా బలంగా వాళ్ళ కళాసంస్కృతులను విప్లవ ప్రయోజనాలకోసం మలచడంగానీ, వాళ్ళజీ తంలోని అద్భుతమైన ఉద్వేగాన్ని సైటిసాహిత్యంలో రికార్డ్ చేయడంగాని జరగలేదు. ఈ కొత్తరంగంలోకి నేటికాలపు విప్లవసాహిత్యమే ప్రవేశించింది.

ఈ ప్రవేశానికూడా ఒక భౌతికఅవసరమే ఏర్పడింది. భారతదేశంలో జాతులసమస్యను నూతనప్రజాస్వామిక విప్లవంలో భాగంగామాత్రమే పరిష్కరించుకోగలమనే అవగాహన యిదివరకన్నా స్పష్టంగా మనకు నక్సల్బరీ ఉద్యమమిచ్చింది. నాగా, మిజో, కాశ్మీరీ ప్రజల జాతీయపోరాటాలను కమ్యూనిస్టుపార్టీ బలపర్చినప్పటికీ ఆ రాష్ట్రాల్లో బలమైన కమ్యూనిస్టుపార్టీ ఉద్యమంలేదు. తెలంగాణా విమోచనోద్యమంలో జాతీయ ముక్తి పోరాటాన్ని వర్గపోరాటంలో సమన్వయించే ప్రయత్నమూ మనంచేశాం. రివిజనిస్టుపార్టీ విద్రోహంలేకపోతే ఫలితమూ మనం సాధించివుండేవాళ్ళం. ఈనాడు తిరిగి శ్రీకాకుళం ఆదిలాబాద్ అనుభవాలు జాతులసమస్య మాత్రమేకాదు ఉపజాతులూ తెగలూ మొదలైన ప్రత్యేక సాంస్కృతిక శ్రేణుల సమస్యలను పరిష్కరించే బాధ్యతనుగూడా ప్లవోద్యమంపై వుంచింది. వీటికితోడు జార్ఖండ్, అస్సాం, త్రిపుర మొదలైన జాతుల ఉపజాతుల సమస్యలు, ఆందోళనలు ఆ ఆందోళనలలో మార్క్సిస్టులు నిర్వహించవలసిన పాత్ర మన ఎజెండామీదికి వచ్చింది. ఆదిలాబాద్ కరీంనగర్ రైతాంగపోరాటం ఆదిలాబాద్ మొదలుకొని బస్తర్ మీదుగా నదిమీదుగా అడ మీదుగా ఏజెన్సీ ఏరియాల్లో విస్తరించాల్సిన అవసరమూ విప్లవోద్యమానికొచ్చింది. కనుక విప్లవోద్యమానికి అడవిపుట్టుక మొదలుకొని అడవిలో ఆదిమమానవుడు మొదలుకొని కొమురంభీందాకా చేసినపోరాటాల

చరిత్ర, విశ్లేషణ అవసరమైంది. ఈ చరిత్రను ఆ అడవిలో ఆ ప్రజల్లో మమేకం కాకుండా ప్రజాపరంగా అధ్యయనం చేయడం సాధ్యంకాదు. అందుకే విప్లవోద్యమంతో పాటు విప్లవసాహిత్య సాంస్కృతికోద్యమాలుకూడా యీ చారిత్రిక విభాత సంధ్యల మానవకత వికాసాన్ని కళాత్మకంగాను, శాస్త్రీయంగానూ విశ్లేషించడానికి పూనుకున్నది.

ఈ కాలంలోనే ఒక గిరిజన సంస్కృతిలోని - గోండు సంస్కృతిలోని వీర సత్వం వహించవలసిన ఘనమైన చరిత్రనంతా వెలుగులోకి తేవడం జరిగింది. వాళ్ళ భాషలోకి విప్లవసాహిత్యం అనువదించడం జరిగింది. వాళ్ళభాషలో సాహిత్యం సృష్టించడం జరిగింది. అంతకన్న ముఖ్యం, ఆ గిరిజన భాషలో మొట్టమొదటి సారిగా ఈ కాలంలోనే అచ్చైయినపుస్తకం విప్లవసాహిత్యం కావడం. అంతేకాదు, వాళ్ళ గతపోరాటయోధుని జీవితకథకు ఈ కాలంలోనే అద్భుతమైన కళారూపం ఇవ్వడం జరిగింది. ఇప్పుడిప్పుడు లంబాడీ, కోయ, సవరభాషల్లోకూడ విప్లవసాహిత్యం వికసిస్తోంది. ఇక, సాహిత్యవిమర్శ గత రెండుమూడేళ్ళుగా ఎన్నెన్నో కొత్తదార్లు తొక్కుతున్నది. గతరెండుమూడేళ్ళుగా సాహిత్యాన్ని సాహిత్యకోణం నుంచేకాక చరిత్ర, అర్థశాస్త్రం, తత్వశాస్త్రం, రాజకీయాల ఆధారంగా పరిశీలించడం జరుగుతున్నది.

సాహిత్యవిమర్శకూడా అదో ప్రత్యేకమైన అలంకారశాస్త్రంవలె కాకుండా దానికి కూడా పునాది వర్గపోరాటం అనే స్పష్టమైన అవగాహనతో వెలువడుతున్నది. చరిత్ర, తత్త్వశాస్త్రం, అర్థశాస్త్రం, వర్తమాన పోరాటాలు నేపథ్యంగా ప్రస్తావించకుండా సాహిత్య విమర్శ గాలిలో సాములాగా రావడంలేదు. నక్సల్బరీ తర్వాత విప్లవ సాహిత్య విమర్శలో యీపద్ధతిని సరోజ్‌దత్తా ప్రవేశపెట్టాడు. బెంగాలో రాజారాం మోహన్‌రాయ్ మొదలుకొని గాంధి, ఠాగూర్, సుభాష్‌ల వరకు సాంస్కృతిక సాహిత్యరంగాల్లో నక్సల్‌బరీ తర్వాతనే తీవ్రమైనచర్చ బెంగాల్‌లో జరిగింది. తెలుగులోను విరసం ఆవిర్భావం తర్వాతనే గురజాడ మొదలుకొని చలం వరకు యీనాడు సంచలనాత్మకమైన చర్చలు జరుగుతున్నాయి. మరొకవైపు భూస్వామ్య సంస్కృతికి సాధారణరూపాలైన అలంకారశాస్త్రం, ఛందస్సు, వ్యాకరణం భాషాపద్ధతుల్లో విప్లవ సాహిత్యాన్ని ఎదుర్కోవడం సాధ్యంకాదని తేలిపోయింతర్వాత (విరసం ఏర్పడగానే వీళ్ళు సాహిత్య నక్సలైట్లు, శ్రీకాకుళంలో లాగానే వీళ్ళసంగతి కూడా మన్నేతేల్చాలె

అని విశ్వనాథ సత్యనారాయణ వెంగళరావుకు వలహాయిచ్చి సాహిత్యరంగంలో విరసంను ఎదుర్కొనే తన అసహాయతను ప్రకటించాడు) మార్క్సిస్టు 'ప్రమాణాల' తోనే విప్లవ సాంస్కృతికోద్యమాన్ని మోటూరి హనుమంతరావు మొదలుకొని గుంటూరు శేషేంద్రశర్మ దాకా దాడిచేసినపుడు లోనాబయటా చొరబారుతున్న యీ మార్క్సిస్టు వ్యతిరేక ధోరణులను ఎత్తిచూపులూ సాహిత్యవిమర్శ వచ్చింది. ఆర్ ఎస్ ఎస్ దర్శనం, కవిసేనలలోని మార్క్సిజం బండారమేమిటో మధుసూదన రావు బట్టబయలుచేశాడు. అలాగే ఏటుకూరి బలరామమూర్తి, రాచమల్లు రామచంద్రారెడ్డి వంటి 'మార్క్సిస్టు' సాహిత్య విమర్శకులు మార్క్సిజం ముసుగులో శిల్ప వాదాన్ని ఎట్లా ఆశ్రయిస్తున్నారో అందుకు కారణమైన రివిజనిస్టుపునాది ఏమిటోఆయన ఎత్తిచూపాడు. అదేవిధంగా వీరేంద్రనాథ్‌లోని సూడోసైన్స్‌ను, కంభంపాటి చరిత్ర రచనలోని బలహీనతను కూడా బాలగోపాల్ ఎత్తిచూపాడు. ఒక్కమాటలో విప్లవ పదజాలంతోనే విప్లవాన్ని ఎదుర్కోవడానికి ఉపరితలంలోని అన్ని రంగాల్లో (పునాది పైనే) జరుగుతున్న ప్రయత్నాలనూ కుట్రలనూ యిటీవలికాలంలో విప్లవ సాహిత్య సాంస్కృతికోద్యమాలు సృజనాత్మకంగానూ విశ్లేషనాత్మకంగానూ భగ్నంచేస్తున్నాయి.

ఇదంతా కొత్తదనానికి సూచికే. ఇక మౌలికత విషయానికొస్తే విప్లవ సాహిత్యోద్యమ ప్రారంభ దినాల సాహిత్యంలో ఉన్నంత అన్వయ కాఠిన్యత, సంక్లిష్టత, మనవి కాని పదచిత్రాల ప్రయోగం, పేలవమైన వ్యక్తీకరణలు ఇవాళ చాల తక్కువగా కనిపిస్తాయి. పదమూడేళ్ళ పురోగమనంలో విప్లవసాహిత్యం ఎన్నో పలుకుబళ్ళను తనలో ఇముడ్చుకుంది. ఎంతో నేటివిటీని సాధించుకుంది. ఈ పలుకుబళ్ళకు, నేటివిటీకి పాట, కథ, నవల, ఇతర దృశ్యకళారూపాలు అన్నీ సజీవ నిదర్శనాలే.

తెలుగు విప్లవ సాహిత్యం మార్మికతకూ, తీవ్రమార్మికతకూ బలైపోతున్నదని కూడ ఒక విమర్శ వినబడుతోంది. ఈ విమర్శ బహుశా కవిత్వానికే ఎక్కువగా పరిమితమనుకుంటాను. విప్లవ కవిత్వం అనుభూతిలేకుండా వెలువడుతున్నదని శత్రు వులు చేస్తున్న ఆరోపణకూ ఈ మార్మికత ఆరోపణకూ సారాంశంలో ఏమీ తేడాలేదు. అసలు కవిత్వం అనుభూతిలేకుండా వెలువడగలుగుతుందా? అలాంటప్పుడు ఆ అను భూతి స్పష్టమైన, నిర్దిష్టమైన రూపంలోనే ఉండగలదుగాని, అనుభూతి దానికదే మార్మికరూపంలో వ్యక్తీకరణ పొందగలుగుతుందా? ఇది అసాధ్యం కనుక ఖచ్చిత మైన, నిర్దుష్టమైన అనుభూతిని కవి తీవ్రమార్మికతలోకి మారుస్తున్నాడనుకోవాలి.

అంటే విప్లవకవి తన అనుభూతికి కవితారూపం ఇవ్వడంకాక అనుభూతి ఆధారంగా మాటలతో ఎక్సర్‌సైజ్ చేస్తున్నాడన్నమాట. విప్లవకవులు అసలు అనుభూతి అనేదే లేకుండా, నినాదాలను, పచ్చివచనాన్ని కవిత్వంగా చెలామణీ చేస్తున్నారని శత్రువులు చేస్తున్న ఆరోపణకూ, ఈ ఆరోపణకూ ఇందువల్లనే పునాది ఒకటే. నిజానికి జరుగుతున్నదేమంటే ఈ మధ్యకాలంలో విప్లవ కవిత్వం సాంద్రతరం కావడంమొదలైంది. విప్లవకవిత్వం కవిత్వభాష(?)లోకి ప్రయాణిస్తోంది. ఇది సాధారణ ప్రజానీకానికి ఎక్కువ స్పష్టంగా ఉండకపోవచ్చు. కాని ఈ సాంద్రకవిత్వానికే స్పందించే మధ్యతరగతి పాఠకుల సంఖ్య ఇంకా ఎక్కువగానేఉంది. విప్లవకవిత్వ పరిమితి అంతే అనుకుంటే, దాని విస్తృతి గురించిన అత్యాశలు పెట్టుకోకుంటే ఈ సాంద్రత మార్మికతగా ఏమీ కనిపించదు.

పైన చర్చించిన ఆరోపణలన్నిటి ఆధారంగా తెలుగుసాహిత్యంలో నేటిస్థితి స్తబ్దత అని మరొకవాదన తలెత్తుతున్నది. ఇలా తెలుగుసాహిత్యంలో స్తబ్దతవాదన 1970 తర్వాత చాలమంది చాలసార్లు లేవనెత్తారు. 'విప్లవకవిత్వంలో ప్రతిష్టంభన ఏర్పడిందని' జ్వాలాముఖి 1972లోనే రాశారు. 'విరసం పెంపుదల ఏనాడో ఆగిపోయింది' అని జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌లు 1975లో రాశారు. '1975 దాటిన తర్వాత విరసం ప్రధానరేఖగా ఉండటం సన్నగిల్లింది' అని అద్దేపల్లి రామమోహనరావు 1980లో రాశారు. '1965 నుండి '78 వరకు సాగిన కవితాఝరి ఆగిపోయి, అంతకుముందుండినట్లే స్తబ్దతకు గురైందనీ, ఇంకా స్తబ్దత పెరిగితే రాబోయేది అంధకారయుగమౌతుందనీ' నగ్నముని 1983లో అన్నారు. 'నేటితెలుగు సాహిత్యరంగాన్ని ఒక్కమారు స్థూలంగా పరిశీలిస్తే ఒకరకమైన స్తబ్దత ద్యోతకమవుతుంది' అని 'సమరసేన' 1983లో రాశారు.

రాజకీయ, సాహిత్య విశ్వాసాలలో పరస్పరం తీవ్రవిభేదాలు కలిగిఉన్న వీళ్ళందరూ ఒకేవాదనను వేరువేరు మాటలలో, వేరువేరుసందర్భాలలో ప్రకటిస్తూ వస్తున్నారు. అందువల్లనే స్తబ్దత అంటేఏమిటో, తెలుగు సాహిత్యరంగంలో స్తబ్దత అని దేన్నంటామో, తెలుగుసాహిత్యంలో స్తబ్దత అనేమాట ఎప్పుడు వాడబడిందో, అనాడు స్తబ్దతకు సూచికగా చూపబడిన అంశాలేవో పరిశీలించాలి. తద్వారా ప్రస్తుతస్థితి స్తబ్దత అవునోకాదోతేల్చాలి.

(వచ్చేసంచికలో - తెలుగుసాహిత్యంలో స్తబ్దత ?!)

# సర్వేశ్వర్‌దయాల్ సక్సేనా

ఒక విప్లవకారుని మరణం కూడా ప్రజలకు ఏ పోరాటప్రతిజ్ఞలను ప్రేరణ అవుతుందో ఎంతో కళాత్మకంగా తానెన్నడూ చూడని చెరబండరాజు గురించి రాసిన సర్వేశ్వర్ దయాల్ సక్సేనా తెలుగు ప్రజాతంత్ర ఉద్యమానికి ఎమర్జెన్సీ కాలంనుంచి ఎక్కువ పరిచయం. హిందీసాహిత్య రంగంలో ఆయన లబ్ధప్రతిష్ఠుడు. కేంద్ర సాహిత్యఅకాడమీ ఢిల్లీలో సంతాపసభ ఏర్పాటుచేసేంత సుప్రసిద్ధుడు. హిందీ సాహిత్యంతో పరిచయమున్న ప్రతిఒక్కరికీ పరిచయం వుండవలసిన 'దినమాన్' పత్రికలో ఎంతోకాలం పనిచేసాడు. అలహాబాదులో ఎం.ఏ చేసి, ఉపాధ్యాయవృత్తి చేసి ఢిల్లీ ఆకాశవాణిలోచేరి అటునుంచి పత్రికారంగంలో ప్రవేశించాడు. చనిపోయే నాటికి బహుళ ప్రచారంలోవున్న పిల్లలపత్రిక 'పరాగ్'కు సంపాదకబాధ్యతలు నిర్వహిస్తున్నారు.

అంతకన్నా ఎంతో ముఖ్యం అకస్మాత్తుగా గుండెపోటుతో మరణించేసమయానికి ఆయన తలమునకలుగా అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితికి ఢిల్లీ ప్రథమ మహాసభల పనుల్లో వున్నాడు. ఆయన ఆ సభల ఆహ్వానసంఘానికి అధ్యక్షుడు.

Burning Decade (దందహ్యమాన దశాబ్దం)లో పరేశ్ ధర్ చెప్పినట్లు నక్సల్బరీ తర్వాత ఎమర్జెన్సీ దేశవ్యాప్తంగా మేధావులను, కళాకారులను మీరెటువైపు- ఇందిరా నియంతృత్వంవైపా, ప్రతిఘటనవైపా అనిప్రశ్నించింది. ఆ సవాల్‌ను ఎదుర్కొన్న ప్రజాతంత్ర రచయితల్లో ప్రతిభావంతమైన చిరస్మరణీయమైన కవితలు రాసినవాడు సర్వేశ్వర్ దయాల్ సక్సేనా. మెల్లగా నడవకు, ఎర్ర సైకిలు, నిరీక్షణ మొదలైన ఆయన కవితలు ఎమర్జెన్సీ భయంకరనిశ్శబ్దాన్ని అంతకన్నా నిశ్శబ్దంగా బద్దలుచేసిన కోపాన్ని వ్యక్తపరుస్తాయి.

ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత ఢిల్లీలోజరిగిన పి యు సి ఎల్ డి ఆర్ జాతీయ సదస్సుసందర్భంగా దాని ఢిల్లీశాఖ ప్రచురించిన 'రక్తబీజ్' కవితా సంకలనానికి సర్వేశ్వర్ దయాల్ సంయోజకుడు. వాళ్ళే ఇంగ్లీషులో ప్రచురించిన Dissenting voices లో కూడ ఆయన కవితలున్నాయి. విరసంకోసం చెరబండరాజు కవితలను హిందీలోకి అనువాదంచేసే బాధ్యతను ఆయన స్వీకరించాడు. ఆయనకు ఎంతో ఇష్టమైన ఆపనీ, అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితి సభలు పూర్తికాకుండానే ఆయన సెప్టెంబర్ 24 వ. తేదీ వేకువజామున మరణించాడు. మరణించేనాటికి ఆయన వయస్సు 57 సంవత్సరాలు.

అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితిలో ఇప్పటివరకింకా హిందీరాష్ట్రాల నుంచి ఏ సంఘంకానీ, సంస్థకానీ చేరలేదు. ఎఐఎల్ఆర్‌సికి హిందీ ప్రజాతంత్ర సాహిత్యోద్యమంతో ఒక సజీవసంబంధంగావుండగల సర్వేశ్వర్‌దయాల్ మరణం తీరనిలోటు. అఖిలభారత విప్లవ సాంస్కృతిక సమితిని హిందీ భాషా ప్రాంతాల్లోకి విస్తరింపజేయడంలోనే ఆయన సంస్మరణకు సార్థకతవుంది.

# తోడేలు

సర్వేశ్వర్ దయాల్ సక్సేనా

తోడేలుకు ఎర్రగా పొడుచుకొచ్చే కండ్లున్నాయి
నీకళ్ళుకూడా అంతే ఎర్రవై తీక్షణమయ్యేదాకా
తీవ్రంగా ఆ గుడ్లల్లోకి చూడు
ముఖాముఖి గుడ్లల్లోకి చూసుకుంటూ
నిలబడ్డ తర్వాత నువ్వింకేం చెయ్యగలవు

నువ్వు మొహం తిప్పుకొని పరుగెత్తావనుకో
అయినా అతడు నీతోనే వుంటాడు
నీలో ఎక్కడోనిలబడి నిన్నేచూస్తూ
నీ ఉనికి పలాయనమైతే
తోడేలు కళ్ళు ఎర్రగా పొడుచుకొస్తూనే వుంటాయి

తోడేలు కూస్తది
నువ్వు నిప్పుకణిక వెలిగిస్తావు
నీకూ దానికి అదే మౌలికమైన తేడా
తోడేలు నిప్పుకణిక వెలిగించలేదు
ఇప్పుడింక నువ్వు ఆ మంటను ఎత్తిపట్టుకొని
తోడేలు దగ్గరగా కదులు
తోడేలు పరిగెత్తుతుంది
మంటల్ని లక్షల చేతుల్తో ఎత్తిపట్టు
ప్రతిపొదలోకి పద
తోడేళ్ళన్నీ పలాయనం చిత్తగిస్తాయి

అప్పుడు వాటిని అడవుల్నుంచి తరిమేసి
మంటలో వదిలిపెట్టిరా
ఆకలిగొన్న తోడేళ్ళు అరచి అరచి
ఒకదాన్నొకటి చీలికలు పేలికలుగా చీల్చుకొంటాయి

తోడేళ్ళు భయపోతాయి ,
నువ్వో ?

* * * *

తోడేళ్ళు అకస్మాత్తుగా మళ్ళీ వస్తాయి
వీటితోనే ఒకడు, ఒకరోజు
తోడేలుగా మారుతాడు
అతని జాతివ్యాప్తి మొదలవుతుంది

తోడేలు కావడం అవసరం--
నీకు మంచేదో నువు తెలుసుకోవడానికి
నిర్భయం అనే ఆనందాన్ని నేర్చుకోవడానికి
నిత్యారణ్యంలో ప్రతిసారీ
మంటల్ని తేపడం నేర్చుకోవడానికి

తోడేలు తనగుహనుంచి తరమబడుతుంది
పాశవిక మానవుల ఒకే మనిషిగా
మంటలతో దాన్ని తరుముతూ—

చరిత్ర సజీవంగా వుంటుంది
నువ్వూనూ
మరి తోడేలో ?

---

## సవరణ

ఈ సంచికలో 5,6,7,8 పేజీలు పొరపాటున 5,8,7,6లుగా ప్రింటయింది. అలాగే 36వ పేజీతర్వాత 41వ పేజీగా ప్రారంభమయింది. కానీ ఆ పేజీని 37వ పేజీగానే గమనించాల్సిందిగా కోరుతున్నాం. 66వ పేజీలోని 'కన్నుల్లో మెరుపాయె' పాట రచయిత దేవ్‌సింగ్ పేరు పాట మొదటిపాదంగా వచ్చింది. ప్రెస్సు వారి ఈ అజాగ్రత్తవల్ల పాఠకులకు ఆ రచయితకు కలిగిన అసౌకర్యానికి చింతిస్తున్నాం.

# నక్సల్బరీ

కుమార్ వికల్

అర్ధరాత్రి
దినమంతా పొందిన పరాజయాలవల్లనో
విజయాల మత్తులోనో
అవిశ్రాంతంగా నిద్రకోసం జనం ప్రయత్నిస్తుంటే
అతడు నగరానికి వస్తాడు
వచ్చి నగరం గోడలమీద పోస్టర్లు అంటిస్తాడు
ఇళ్ళ తలుపులమీద
ఒక గ్రామం పేరు రాస్తాడు
వాళ్ళు ఉదయం లేచేపరకు
నగరమంతటా
ఒక వెరపు వ్యాపిస్తుంది
వాళ్ళు నిశ్శబ్దంగా వుండిపోతారు
రహస్య ఏజెంట్లు
ఇళ్ళు, హోటళ్ళు, ఆఫీసులమీద
నిఘావుంచుతారు
కాని బడినుంచి వచ్చిన నా పిల్లవానికి
దేశపటంలో
ఆ గ్రామంపేరు దొరకదు
'ఈ పటంలో
ఈ గ్రామం ఎందుకులేదు ?'
అని అడుగుతాడు
నాకు భయమేస్తుంది
ఈ నాలుగక్షరాల శబ్దం
ఒక గ్రామంపేరు మాత్రమే కాదు
అది మొత్తందేశానికే
పేరని
నాకు తెలిసినా
నేను మౌనంగా వుండిపోతాను

STOPPRESS

నేలమీద పరిపాలన - నింగివిరిగి పడినవాన

తెలుగు ప్రజల బ్రతుకులోన

## ఇటు తుపాకి - అటు తుఫాను

పులిమీద పుట్రలాగ పోలీసు నిర్బంధాలు, భూస్వాముల, పెత్తందార్ల దౌర్జన్యాలకు గురియవుతున్న తెలుగు ప్రజానీకంమీదికి తుఫాను దాడిచేసింది. తెలుగుదేశం నాయకుడు ఢిల్లీకి మార్గం అన్వేషిస్తూ శ్రీనగర్ దాకా వెళ్ళగా తెలుగు దేశాన్ని వరదభీభత్సం ముంచెత్తింది. (ఎన్టీఆర్ హైదరాబాదులో వుంటే ఆపగలిగే వాడనికాదు ఆయన కళ్ళముందే ఆయన కాళ్ళసందుల్లోనే మతకలహాలని పరిశోధన విశ్లేషణ అక్కర్లేకుండానే పిలవబడే నెత్తుటిచిత్తడి ఇంకా ఆరలేదు.) కరీంనగర్, నిజామాబాదుజిల్లాలు, కొంతవరకు వరంగల్ జిల్లా ఇదివరకొకసారికూడ ఈ అతివర్ష అరిష్టాన్ని రుచిచూసాయి. అయితే ఈసారి శ్రీకాకుళం విజయనగరం విశాఖ ఉభయగోదావరులు మొదలుకొని గోదావరి పొడుగునా నిజామాబాద్ దాకా ఈ తుఫాను చేయగలిగినంత నష్టాన్ని చేసిపోయింది. (ఎన్నడూ నీళ్ళయినా చూడనోచుకోని వరంగల్ ప్రజలు ఈ ప్రమాదం ఇంక పోయినట్లేనని అనుకోవడానికే భయపడు తున్నారు) ప్రభుత్వం లెక్కల ప్రకారమే దాదాపు వందమంది దాకా మరణించారు. దాదాపు వెయ్యిగ్రామాలు వరదతాకిడికి ముంపుకు గురయ్యాయి. వేలాది ఇళ్ళు కూలిపోయాయి. ప్రభుత్వ లెక్కల ప్రకారమే విజయనగరంజిల్లాలో రెండువేలు వరంగల్ జిల్లాలో వెయ్యిఇళ్ళు కూలిపోయాయి. తన కుటీరానికి - తనదీ కుటీరమే - లక్షలరూపాయలు ఖర్చుయ్యే ముఖ్యమంత్రి పూర్తిగా ఇల్లుకూలితే రెండువందలు సగం కూలితే వందరూపాయలు నష్టపరిహారం ప్రకటిస్తున్నాడు. హెలికాప్టర్ నుంచి 'సుందరప్రళయాన్ని' చూసి విమానాశ్రయాల్లో పత్రికల్లో విలపిస్తున్నాడు.

రైలుదారులు, రోడ్డుదారులు ఎన్నెన్నిచోట్ల ఎన్నెన్ని గండ్లుపడి ఎక్కడివాళ్ళు ఎక్కడ ఏ పరిస్థితుల్లో చిక్కుపడిపోయారో తెలుసుకునే ఆధునిక వార్తాప్రసార పద్ధతు

లన్నికూడ ధ్వంసమయ్యాయి. లాయిన్‌హాత్ తిక్కపక్షద్వీపంలాగా తెలుగుదేశ ఒకరితో ఒకరికి సంబంధాలులేని ఎన్నోద్వీపాలయింది. ఈ ద్వీపాల్లో దీపాలులేవు చుట్టూనీళ్ళవుండి తాగడానికి నీటిచుక్కలేదు. రైలుస్టేషనులు, బస్‌స్టాండులు కాల దిశాకుల గుడారాల్లాగ మారాయి.

ఎక్కడెక్కడి కొండలో, చెరువులో, కాలువలో గట్లో ప్రవహించి గోదావ పొంగులు గోదావరి పొంగిపోయి 'శిశువుకు దక్కని స్తన్యంలాగ' సముద్రం పాలవు తుంది. పునాసపంటలు ఇదివరకటి అతివృష్టికే పోయాయి. ఈ దెబ్బకు కొట్టుక పోకుండా మిగిలిన వరిపొలాలు వుంటే ఎర్రిబారి, గిడసబారి కొత్తకొత్త రోగా బాధపడతాయి. మళ్ళీ ఎండాకాలం వచ్చేవరకు ప్రజలకు తాగేనీళ్ళ వుంటాయన్న గ్యారంటీలేదు. ఈ ఒకటిరెండు రోజులు 'యుద్ధప్రాతిపదిక' చర్యల హడావిడి ఏ ఇ మార్టూరు పెద్దపెల్లి ఎన్నికల్లోనో ఏ క్రికెట్ విజయంలోనో, ఏ దసరా ఉత్సవా సంరంభంలోనో, ఏ ఎలిజబెత్‌రాణి పర్యటన హోరులో కలిసిపోయిందా. ఇంక ప్రజలు కలరాతోనే చస్తారో, నిరాశ్రయులుగానే మిగిలిపోతారో. మిగిలినవాళ్ళ కిరోసిన్, బియ్యం చౌకదుకాణాల క్యూలలోనే నలిగిపోతారో ఎవరికిపట్టింది.

ముప్పైఆరేళ్ళ స్వాతంత్ర్యం ! ఆర్యభట్టు మొదలుకుంటే ఇన్‌సాట్‌ల వరక మన ఘనవిజయాలేకాదు రష్యారోదసిలోకి రాకేశ్‌శర్మలను పంపించేంత సాంకేతి అభివృద్ధి ! అక్షలగ్రామాలకు తాగేనీళ్ళులేవు. పొర్లిపోయే వరదలను అరికట్టే పద్ధతిలేదు. ప్రజలసంతా సామ్రాజ్యవాదుల, భూస్వాముల, దోపిడీకి ఎట్లా ఒప్ప జెప్పి వాళ్ళముందు చేతులుకట్టుకొని కూకున్నదో ఈ వ్యవస్థ ప్రకృతి వైపరీత్యాలక కూడ అట్లేఒప్పచెప్పి కూర్చున్నది. ప్రభుత్వంపై ప్రకృతిపై పోరాటం చేయడ తప్ప ప్రజలకు పారిపోవడానికి కూడ దారులన్ని బందయ్యాయి.

8.10.8

# సృజన వద్ద అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

సృజన ప్రచురణలు :

1. నా కుటుంబం - నవల — టావ్ చెంగ్ 4.00
2. ఉప్పెన - నవల — చౌలి-పో - రెండవభాగం 6.00
3. ఉద్యమం నెలబాలుడు - కవితలు — శివసాగర్ 5.00
4. ప్రజాసాహిత్యం, కళలు ఎలా వుండాలి? — వర్గీస్‌వ్యాసాలు 2.00
5. శ్రీశ్రీపై సృజన సప్లిమెంట్ 1.00

విరసం ప్రచురణలు :

1. శ్రీశ్రీ వ్యాసాలు - (1970-1983) 15.00
2. కత్తిపాట - చెరబండరాజు పాటలు 4.00
3. గ్రామాలు మేల్కొంటున్నాయి - నాటకాలు - నాటికలు - చెరబండరాజు 8.00
4. గంజినీళ్ళు - నాటిక (AILRC ఢిల్లీ సభల సందర్భంలో ఇటీవలే విడుదలయింది) 1.50
5. పోరాటాల శ్రీరాములు - పరిటాల రచయిత 0.75
6. పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి 3.00
7. తెలంగాణా పోరాట పాటలు - రెండవ సంపుటి 4.00

ఇతర ప్రచురణలు :

1. చెరబండరాజు కవితలు - పాటలు 6.00
2. కొకు సాహిత్య సమాలోచన - ప్రగతిసాహితి, ఢిల్లీప్రచురణ 10.00
3. అల్లం వీరయ్య పాటలు 1.50
4. సృష్టికర్తలు - కథలు — అల్లం వీరయ్య 5.00
5. పాట వెన్నెలమీద నడుస్తుంది - కవితలు - అజ్ఞాతసూరీడు 3.00
6. సముద్రం - కవితలు — వరవరరావు 2.00
7. బతుకుపోరు - నవల — బి.ఎస్. రాములు 5.00
8. సుద్దాల హనుమంతు పాటలు 4.00
9. ఎమర్జెన్సీ తర్వాత 'ఎన్‌కౌంటర్' హత్యలు - APCLC 1.00
10. వరంగల్ జిల్లా అప్రకటిత కల్లోలితప్రాంతం? - APCLC 3.00
11. లాల్ బనో గులామీ ఛోడో - బోలో వందేమాతరం - ఎన్. కె. 1.00
12. అనామకుడి డైరీ కథలు - కె. రాంమోహన్‌రాజు 5.00
13. చర్య — కవితలు - సాగర్ 2.00
14. క్రాంతిగీత్ - హిందీ పాటలు, కవితలు 3.00
15. anonymous struggles - PUDR Booklet 2.00
16. భూమి - కథలు 5.00
17. నక్సల్బరి వెలుగులో-సుమంతబెనర్జీ మూలం: కృష్ణమూర్తి అనువాదం 24.00

పై పుస్తకాలు కావలసినవారు తగుపోస్టేజితో కలిపి డబ్బు M.O ద్వారా సృజన హనుమకొండ, వరంగల్ 506 001 కు పంపవచ్చు బుక్-పోస్ట్‌లో పుస్తకాలు పంపుతాము.

SRJANA Telugu Monthly Oct./'83 H/HNK-3
Regd. No. witn Registrar of Newspapers 10953/67

# ALL INDIA LEAGUE FOR REVOLUTIONARY CULTURE

## Statement of Solidarity

A welcome phenomenon in our cultural life at the present critical juncture ia the country is the detremined and politically conscious effect to break totally from the stagnating, deteriorating values and mores. Such a development is logically bound up with a fundamental change in the socio-economic set-up propped up by exploiters both at home and abroad. Pepulism has failed to deliver the goods. On the contrary, it has been able to hoodwink the masses and to lead them into political miasma. The real creators of the material wealth, be they workers or peasants or even the lower strata of the middle class, must wresu state power in order to improve their lot radically. They should be the real masters of all nature's gifts. primarily land.

A cultural movement cannot be regarded as an independent category, it is interwoven with all other aspects of life. The strand of people's own culture has always had its own life. The talk of 'mainstream' only serves to cover the domination of the ideology of the ruling class. A genuine effect has to be made to break it.

The All-India League for Revolutionary Culture, now in the offing, will, we earnestly believe and hope, strive to fulfil this historic task, helping the broad masses of our countrymen to reach newer and brighter vistas of life.

Sd/-

Samarsen, Mahaswethadevi, Satchithanandanan, Sarveswar Dayal Saxena, Dr. Cr Rajagopalan, Kalipatnam Rama Rao, Vasantha Kannabiran, Govind Mukhoti. Azgarali Engineer, Udayan Misra, P. R. Shukla, Anuradha Ganthi, Dr. Raiagopal, Prof. Venugopal Rao, R. V. Sastry, Inquilab, Manoranian Mohanty, Dr. K. Seshadri, Sumanto Banerjee and many others.

SRAJNA
Hanumakonda 506001

Single copy Rs. 3-00
Yearly Subscription Rs. 20-00